[illegible] ము.

శ్రీరస్తు.

శ్రీవిశ్వకర్మపరబ్రహ్మణే

# సంజ్ఞాపరిణయము

ఇయ్యది

కృష్ణాజిల్లా నూజివీడుతాలూకా [illegible]

గొల్లనపల్లి వెంకటసుబ్బరా

బాహుబలేంద్రపురేశుండగు విశ్వేశ్వ

రచియింపబడి

సూరిజనవిధేయుండగు సూరి కృ

పరిష్కరింపంబడి

బాహుబలేంద్రపురవాసియు పౌరుషేయ

అహభూనసగోత్రజుండునగు

వింజవరపు సుబ్రహ్మణ్యాచార్యులయొక్క

తదుపరి సుపర్ణసగోత్రజుడగు

గుండిమెడ వీరాచారియొక్కయు

అన్యోన్యద్రవ్యసహాయముచే

ఏలూరునందలి రామమోహనముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడి ప్రచురింపంబడియె

541

మొదటికూర్పు 1000 కాపీలు.

దీనివెల 0-8-0

1910

[illegible] శుభమస్తు అవిఘ్నమస్తు.

# స్వాహాపరిణయము.

541




క. శ్రీపార్వతీశగిరిశవిరూపాక్షావామదేవరుద్రమహేశా
నీపాలబడితినన్నిక కాపాడుముకరుణతోడగౌరీనాథా.

వినాయకప్రార్థన.

క. కరివదనువిఘ్ననాయకు గిరిజాసుతుగుజ్జువేల్పుగీర్వాణనుతున్
పరిపరివిధములనీకృతి పరిపూర్తియొసంగమదినిభక్తిందలతున్.

దరువు పంతువరాళిరాగం అటతాళం.

విఘ్నరాజబ్రోవవే నమోనమో విఘ్నరాజబ్రోవవే॥ విఘ్నరా
జానేవిరచించెడుకృతి విఘ్నముసేయక విస్తరింపజేసి॥ విఘ్న॥ గుజ్జ
రూపముతోను బొజ్జకదలగాను సజ్జనపోషకసందియమ్ములేక॥ వి॥ వం
కరతుండముపాంకముతోనాద శంకరసుతనిశ్చింతహర్షముతోడ॥ విఘ్న॥
బాహుబలేంద్రుని పట్టణాధీశుడాసోహమంటినని సుస్థిరముగదెల్పి॥
॥విఘ్న॥ ౮

నారాయణస్తుతి.

ఉ. శ్రీకరమైననీపదము చిత్తమునందనుభజింతుశ్రీహరీ
యోకమలాక్షనామనవి నొప్పుగనీవిపుడాలకింపుమీ
నాకవితామనోజ్ఞత జనార్దనవేగమ వృద్ధిసేయవే
నీకరుణాకటాక్షమున నేమదిబూనితిసయ్యనీకృతిన్.

ఆంజనేయస్తుతి.

గీ. అంజనీసుతుదలచెదననుదినంబు। కామితార్థములిచ్చియుగా
వుమనుచు। వేడ్కసుఖములనొసగియు వెలయుమనుచు। ఇలను
భద్రములొసగి రక్షించుమనుచు॥

సరస్వతీప్రార్థన.

గీ. వాణిదలచెద మనమున వాంఛితార్థ। సిద్ధికై మ్రొక్కివేడెద

...ముగను। నళినిదళనేత్రి కరుణచే నాదువాక్కు। శుద్ధిగావింపుమీవేళ శుభచరిత్రి.

బిళహరిరాగం అటతాళం.

వాణీమ్రొక్కెదబ్రోవవే పరబ్రహ్మ రాణీమ్రొక్కెదగావవే। రాణీమ్రొక్కెదసీకు వీణాపుస్తకపాణీ యేణీలోచనసన్నెపుడుసేవించెద॥ వాణి। తలవాకిలిల్లుగా నిలచిసత్కవులాకు కలుములిచ్చుతల్లి కరుణించుమవేగమే ॥వాణి। ధరనుబాహుబలేందురుని పురవాసిశంకరుని విశ్వేశ్వరు కరుణానుగోచమా. వాణిదలచెద॥

సూత్రధారుడువచ్చినిలిచి— ఓసభాసదులారాసరసాగ్రగణ్యులందరు పరివేష్టించియుండిన యీసభజూడ నాడెందంబపరిమితానందంబు నొందుచున్నయది నేటిరాత్రిచ్చోట సీతాపరిణయంబను నాటకంబు మాప్రజ్ఞాతిశయముగలది నృత్యగీతవాద్యంబులచే హృద్యంబగునటుల వినిపింపంబడును గావున మీరందరు సావధానచిత్తులరై యాకర్ణించి నన్నానందింపచేయుదురని నమ్మియున్నాడను ఇయ్యదిసంగీతసాహిత్యసరసజ్ఞుండును ఆంధ్రకవితాధురీణుండును నగునొల్లనపల్లి సుబ్బరాయామాత్యునిచే రచించంబడియె యిందుసూరిజనవినయుడగు సూరికృష్ణయశాస్త్రి కొన్నినూతన కల్పనల నలంకారంబుల నక్కడక్కడనునచి పరిష్కరించి ప్రకటించెం గావున సరసులగువారందరు దీని నిరసించక రాజహంసంబులు క్షీరనీరంబులు సమ్మేళనంబుజేసి యుంచినచో నీరంబులువిడచి క్షీరంబులుగ్రోలుతెరంగున దోషాన్వేషణంబుమాని సుగుణగ్రహణంబుంగావింతురని నమ్మియున్నాడను.

కవిస్తోత్రం.

సీ. శ్రీకరంబుగవ్యాసు చిత్తంబులోనుంచి కాళిదాసాదిసత్కవులదలచి। నన్నయభట్టునినయముగాగొనియాడి తిక్కనయాజులతిరముగాను। పార్థించికడుభక్తి బమ్మెరపోతనామాత్యునివినుతించి మనములోను। పుడమినిగలయట్టి పుణ్యపురుషులనెల్ల బహువిధంబులుగానుబ్రస్తుతించి। గ్రంథమునుజెప్పబూనితి క్రమముగాను। సఫలముగచేయుడీమీరుసౌమ్యులార। అఖిలవిద్యాప్రపూర్ణులాఆర్యులార। భూనివిఖ్యాతికినితెందు పుణ్యులార॥

క. లక్షణశాస్త్రము లెఱుఁగ సు। రక్షితముగ క
రుగక। రక్షకుఁడగు నీకృపస్ఫూర్తి। లక్షణయుక్తం బెయ్యది
గ్రంథకర్తవ్యాంతం బేమనిన.

ద్విపద. ఈ ప్రపంచంబున వెందుదలిర్చు సుప్రసిద్ధంబతి సుందరం
బైన చిక్కవరంబనే చిన్నగ్రామంబు చక్కగా విలసిల్లు సజ్జనయుతము
అందు విప్రోత్తము డార్యభక్తుండు బంధుసముద్రుండు బహుధర్మశాలి
ననరగొల్లనపల్లివంశజాతుండు ఘనతవహించిన కిరణాసముద్ర డార్య
పొదపెదబుచ్చయామాత్యునకును ఆర్యానసూరామాంబకు పుత్త్రు। డైన
వెంకటసుబ్బరాయుడు భక్తి మానకప్రార్థించి మానవుకృపను విరి
విగాశత్రుఘ్న విజయనాటకము కిరమొప్పగా జెప్పి కమలాక్షుకృపను నా
చిక్కవెంకటనరసింహకవికి ఆదినివినిపించి యందులోపనులు చాలగా
దిద్దించి చక్కజేసియును మేటైనకవులలో మేటియైనట్టి ధరచేతపూడిప
రబ్రహ్మకవిత సహవాసమును జేసి చక్కచేయించి నాటకము గుటచే
నలుగురు గూడి ఆటగా నాడించి తచ్చటచ్చటను.

గీ. ఆటపాటలుగని యు నానందమొంది। బాహుబలేంద్రపురవాసి
భద్రశీలి। విశ్వబ్రాహ్మణకులజుండు వింజనరపు। వంశజాతుండు
స్వామితే నిర్వాహకుండు.

గీ. అభువనసగోత్రజాతుడాచారవంతు। డమితగుణశాలి శంభులింగా
ర్యపుత్రు। లందరికిశ్రేష్ఠుడను పమశిల్పనిపుణు। డార్యసమ్మత
జతిథిసత్కారశీలి.

గీ. ఆఖ్యసుబ్రహ్మణ్యయాచారిశివభక్తి। యుక్తుడగుచు నెగడు నుర్వి
లోన। శంకరాంకితముగ సౌజ్ఞాపరిణయనా। టకము జెప్పు మనుచు
నంత ప్రీతి.

వ. ఇట్లు నన్నుం బ్రార్థించి భాగవతషష్ఠస్కంధాంతర్గతంబగు
యీకథను విరచించిన విశ్వకర్మపురాణంబను గ్రంథంబు నాకొసంగిన
నందలికథాభాగంబంతయు సవిస్తరంబుగా గూర్చి బాహుబలేంద్రపు
రాధీశుండగు విశ్వేశ్వరుని కృతినాయకునిగా నొనర్చి సౌజ్ఞాపరిణయం
బను నాటకంబును పాటవంబునం జెప్పబూనితి తత్ప్రబంధంబైన యక్ష
గానంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

సౌజ్ఞావరిణ...ము

సౌజ్ఞాదేవి తెరలోయుండి.

శా. రావేయోస[illegible] రా వెహంసగమనా రావే సరోజానవా

రా [illegible]కోకిలవాణిరా వెలలనా రాచక్రవాకస్తనీ

రావేయీతరితాళజాలచెలియా రాజీవపత్రేక్షణా

రావే నామదికోర్కెదీర్చగదవే రావేవయారీదయన్.

హాస్యం క. రావేరా వేరావే। రావేరారమ్మటంచు రాకేందుముఖీ

నీవేలబిలచెదవునా। కీవేళను దెల్పు పత్తునింపుదలిర్పన్.

సౌజ్ఞాదేవి. వ. ఓ యక్కా! యొక్కసారినన్నుంగని నీచెంతకుం గానిపోవగదవె చెలియా. అని మరియును.

ఆనందభైరవిరాగం-ఆదితాళం-

నేతాళలేనేఓయమ్మ నేనెట్లుసైతునోయమ్మ నేతాళలేనమ్మ నెల తారోయీవేళ యీతాపామేమో నేనెన్నాడెపుగానమ్మ॥ నే॥ ౧ కొమ్మారో నేనిపు డిమ్మాహిలోపల నంమ్మరుధాకాను నిమ్మళింపగలే నే॥ నే॥ ౨ మేనుకంపమునొందే మానినీయీవేళ కానరాదుయేమి కారణమోగాని॥ నే॥ ౩ బాహుబలేంద్రుని పట్టణాధీశుని పాహిపాహియనిపార్థించెదనమ్మ॥ నే॥ ౪

హాస్యం గీ. యింతిరోరాత్రివేళలోనిందువచ్చి। తాళనేతాళనేతాళతాళ నంచు, సందడిగబల్కుచుంటివిచానవేగ। నెవరునీవిపుడు దెల్పవేఇందువదన.

సౌజ్ఞాదేవి గీ. తల్లిదండ్రులకునుముద్దుతనయనమ్మ। గౌరవముగానుపెరిగినకన్నెనమ్మ। నాదునామంబుదెల్పెదనాతివినుము। సౌజ్ఞయందురునాపేరుసారసాక్షి.

హాస్యం. వ. నీవు సౌజ్ఞవో మూగవో నాకుదెలియదు. గాని నీయూరిపేరేమో నీతండ్రిపేరేమో వివరంబుగా జెప్పుకురావే యో యొప్పులకుప్పా.

ద్విపద. శ్రీరమ్యమాయాది సృష్టికల్పంబు, మీరవిధివిభుశివుల్ మించిస్తోత్రంబు। సారెసారెకుసేయుసత్ప్రార్థనంబు। వేరుసేయకవిరాడ్విశ్వరూపంబు, ఔతరించిజగంబులన్నిసృజించి। యాధారమూర్తి పరిణాఖ్యవహించి పరగవిశ్వబంప్రపంచముఖములను స్ఫురిత

మానిగమములల్ స్తుతిసేయుచుండ మనుమయత్వప్రశిల్పాఖ్యాదైనజ్ఞు లన ప్వప్రికాశులై యవనిలోపలను అభినుతింపవహత్మలౌతరింపయును అభివృద్ధినొందవారందరిలోను ప్రిణుతిగాంచినపరబ్రహ్మయసంగ ఘన తకెక్కిన జగత్కారణమూర్తి.

క॥ యిందీవరదళనేత్రుడు। పెందోటనుపురమజప్రీమె లెడువిద్వాం
ద్వాందితుడౌమయునాత్మజ। సుందరముఖిసౌజ్ఞయనగశోభిల్లుదిలన.

హాస్యం॥ వ॥ నీపేరును నీయూరిపేరును నీతంఢ్రిపేరును జెప్పితివి గాని నీమగనిపేరేమో జెప్పి తెరవెడలిరావె తరుణీమణీ॥

సౌజ్ఞాదేవి॥ గీ॥ మగనినామంబుజెప్పగ మగువలార। అబలనోయమ్మ
పరిణయమైనలేదు। యేమిజెప్పుదు నానాధుడెవ్వడందు।
ధరణినెచ్చట నుండెనోతరుణులార॥

హాస్యం॥ వ॥ అబలవుగావు బలవంతుని ఆలివిగాని చెలియతో చెచ్చెర తెరవెడలిరావే ఓ చిలుకలకొలికి॥

తెరవెడలేదరువు—శంకరాభరణరాగం—ఆదితాళం.

వెడలుదామమ్మా పడతులారా వెడలూదామమ్మా॥ పల్లవి॥ ౧ వెడలుదామమ్మా యికి తడవుసేయకిను కిడుసంతసంబున తడయకనో కసారి ॥వె॥ ౨॥ బంతులు తేరమ్మావింతగాను గంతులిడరమ్మా కంతు వైరిమనల కరుణాబ్రోచును సంతంబుగామనము పాటాలుబాడుచు॥ వె॥ 3 తరుణులము జేరి తప్పకయీ తరిని వృషరికోరి ధరనుబాహుబలేం దురుని పురహరువిశ్వేశ్వరుని మనమునందు స్మరియించుచువేగ॥ వె॥ ౪

బంతులాటదరువు—బ్యాండురాగం—ఆదితాళం.

ఆటలాడుదామమ్మా మనమందరిప్పుడు వేడుకను పాటలా ధరులారా యివ్వనవాటికిను బహునీటుమీరగను॥ ఆట॥ ౧ బంతులా డరమ్మా చామంతులుమల్లెలు వింతగుపువ్వుల సంతోషమ్మున సరస ములాడుచు యింతులమూయీ చెంతవనమ్మున॥ ఆట॥ ౨ ధరనుబాహు బలేందురుని పట్టణధాము నీశుమదిధ్యానముసేయగ విరివిగనుమనకోరి కలు యీతరినెరవేరును తిరముగనందరు॥ ఆటలాడూదమమ్మా॥ 3॥

సంధి॥ సౌజ్ఞాకన్నియ వన్నెలాడులంగూడి బంతులాడుచున్నసమ యంబున॥

నాతినిజూడ అతిప్రీతిదీనినాయంగనగాగ మదిలోనదలచితిమాన్యులబిల చి నైవాహికంబాడవాంఛయుగల్గె బైవానుకూలంబుతగనెట్టుకానో పద్మమిత్రుండనేపౌరుషమిలను పద్మాక్షినిప్రుడుచేపట్టకయున్న సార్థకం బెటులౌనుసరసులుమెచ్చ ప్రార్థనజేసియుపరమయోగులను నిర్మాణ మునసతినిప్రుణుడౌవిశ్వకర్మసంబంధమ్మునకరమొప్పజేసి యశమొందవలె దశదిశలప్రబలముగ కుశలతతోమానికులమురావించి ఏకమ్ముజేసి ఆ యింతికినన్ను నాకోర్కెదీర్పజేసియవిధులారా.

సూర్యుని। వ। యిట్లుమంత్రులకుంజెప్పి పద్మమిత్రుండాపట్టణంబు బాసి నిజనివాసంబునకుంజనియె నంత॥

మయబ్రహ్మకుమారియగు సౌజ్ఞాదేవియు తరుణవయస్కుండగు తరుణునింగని తనకుతరుణునిగామోహించి విరహతాపంబుభరింపుంజాలక నిట్టూర్పులు నిగుడింపుచు తనచెలికత్తెలంజూచి యేమనుచున్నది.

సౌజ్ఞాదేవిమాటలు॥ యేమనిచెప్పుచున్నది—హావారిజాక్షీ హా కీరవాణీ హాకుందరదనా మదనుండు ఐదునిడి వ్రేయు తూపులకో పజాల నంపమ్మాకొంమ్మా॥

హాస్యము॥ హా బూరెలబుంగా హా గారెలగంపా యీరాత్రి తాగిననేతికిన్ని తిన్నఅరిశెలకాకకున్న తాళలేనమ్మా కొమ్మా॥

సౌజ్ఞాదేవి చెప్పుచున్నది—ద్విపద॥ వినవమ్మయోసఖివిన్న వించెదను ఇనుడుయీపురిచెంతకేతెంచినప్పుడు కనుగొంటివనజాక్షికను లారవాని నదిమొదలుగానునామదిభ్రమియించె మదనుండుబాణముల్ మరిమరిబూని గురియింపసాగె నేకువలయనేతి తరలాక్షినేనెట్లుతాళుదు నమ్మ నాకుప్రియుండైననళినాప్తుతెచ్చి ఏకతంబునపెండ్లియేర్పాటుజేయ నాతంప్రికిని దెల్పిసళినాక్షివేగ యీతరినాకోర్కెనీడేర్చరమ్మ వక్కనిము సంబైన నోర్వలేనమ్మ ప్రక్కనతనుని దండుపైపైకివచ్చే॥

సౌజ్ఞాదేవిదర్వు-మధ్యమావతిరాగం.

ఏమిసేయుదునెటులతాళుదు నేమెఓసఖిదెలుపవే భామరోనేతా ళజాలను కాముబాణజ్వాలలకు నేపటులతాళుదు. ౧

మానినిమణిమోవి పానకమాని కుచములనంట్టి రతులనుబూని పెనంగువరుని నీవనుమానించక వేగతేగదే. ౨

అగడుసేయకపగనుబూనక మగువలారగటిగులుబాపరే మొగలి
బాకుచేతబూని యెగసిమారుడువచ్చెనదిగో. 3

యింతిరోయీధరను బాహుబలేంద్రపట్టణశివుని కరుణను కం
తుశరములకోర్వనే నాకాంతునిటుగొని వేగరారే. ౪

సౌజ్ఞాదేవి—ఇట్లతి విరహతాపంబున తరుణీమణులతో నేమనుచున్నది.

సీ. భువిలోననావంటిపొలతికితగినట్టిపురుషుండు లేకుంటపొంకమగునే। క
లకంఠియవ్వనకాలమంతయువ్యర్థా గడుచుచుండెనుమనఃకాలమొ
చ్చె। మోవితేనియలాని మోహంబుతీరగా కాముకేళినిగూడుకాంతు
డిపుడు। కనుపింపడయ్యెనాకర్మమేమందు నేఘుశియతాళగలేనుకాంత
లారా। విరహవేదనచేతనే వేగుచుంటి। వానినెందైనవెతకరేవ
నితలారా। నిమిషమైననునిల్వగానీకమరుడు। మొగలిబాకునగుమ్మెనే
ముదితలారా.

హాస్యము॥ యేమోయీ ప్రోషాణం ప్రోషాణం యేమిటి నీపేరు
యేమీ నాపేరుభూషణము సరేగాని యీసౌజ్ఞాదేవికి వరుడుగావలె
నట యీవరుడు యీపూపవెలపల నెచ్చటనైనా దొరుకునేమో
వెళ్ళివస్తావటోయి వరుడనగా ముసిలినక్క అనుకున్నావా యేమి
కాదు వరుడనగా శ్రేష్ఠుడైనటువంటి భర్త అయితే భర్తను తేగలవా
నాచేతగాదు నీవేతీసుకునిరావలేనూ.

దరువు పున్నాగరాగం.

మారునిశరములు మరిమరిహెచ్చెను యేరీతితాళుదు యెలనాగ
యదేజూడు॥ ౧॥ చక్కనినాచనుల్ నిక్కపొడచెనె మక్కువగల్గెనేమగని
యందుచాల॥ ౨॥ విరహాగ్నిమునిగతీ వెడలగజాలనే మరుకాకలకుతగనుం
దైనయివ్వరె। 3॥ పడతిబాహుబలేంద్రపట్టణశివుడెంతో తడవుశేయు
చుండెదైన్యముదీర్పవె॥ ౪॥

సౌజ్ఞాదేవి—యీప్రకారమువచించుచు మలయానిలు సహాయుండై మీరిన
కులికంబునపై పైకివచ్చెడుమారుంజూచినారీమణియేమనిదూరుచున్నది.

సీ. మగనిచేబట్టనిమగువనీరీతిగమారశరములవేయమంచికాదు। ముగ్ధ
నైయున్నట్టిముదితపైనీవేళదర్పంబుజూపంగతగదనంగ। కోమలినా

పైనకోపంబుపూనుటమర్యాదగాదయ్యామదననీకు। అబలపై నీరీతి నట్టహాసముబూని పైకొననీకిదిపాడిగాదు। పంతగించకుమురరతిపతి వినీవు। కుందకుంతమ్ములనునన్ను గృమ్మతగదు। హరునికేత్రాగ్ని చేతనీవణగిపోయి। క్రౌర్యమునుమానవేమిరకఠినహృదయా.

గీ. నీదుకేతనమబ్ధిమునింగిపోను। నీదుశరములువిరిగియునేలనుబడ। నీశరీరమ్ముభస్మమైనేలగలువ। నీదుచెలికానిసర్వంబునిలచిమింగ.

శంకరాభరణంరాగం—అటతాళం.

మారా పోరా నీరూపుమారా నీదేరపోపోరా మారా మారా సుకుమారీనేయయిదిమేరా సారెసారెకునుచలమునుబూనెదవేరా మీారిపై కిరాకుర॥ మార॥ పోరా॥౧॥ మదనా పదుఐతూపులిటుబరపగనీకిది తగునాకదనమునకాగగలనామదినికరుణమానివేసెదేమిర॥ మార॥పోరా॥ ౨॥ కామామామానభంగమునుజేయకుమా భామినిబాధించకుమా కామినులనుగాసిజేసిదేమిర॥ మారాపోరా॥ ౩॥

వ॥ ఏమిరా మారా విరహిణులనీవిధంబున బాధింపందగునటరా క్రూరా నీబలంబులడవిపాలుగాను నీచెలికాడగుసోముని పాము గరువ నీకోకిలకూజితంబులును నాచిలుకలకలకలంబులును కొదమతుమ్మెదల ఝంకారమ్ములును నామనంబునకు ములుకులై తోచుచుండె గదరా దీనాలాపంబులైన నాలకింపవేమిరా ధీరా నీవనంగుడవై తివిగాని లేకున్న వన్నెలాడులందరము నిన్నుంబట్టిమట్టబెట్టకపోదుమటరా వంటిగానున్న యబలపై కొంటికాలిమీద వచ్చుచుంటివిగాని జంటబాయకుండు దంపతులపై కరుగజాలవుగదరా యీాడువచ్చిరాని యాాడువారిజూడ కదనమునకుకాలుదువ్వెద విదేమిప్రజ్ఞరా కోమలులపై కోడిగములటరా ఛీపోరా ఛీయనినసిగ్గులేదేమిరా॥

అని॥వ॥ ఇట్లుమారునిదూరుతరి సర్వకళాపరిపూర్ణుండగుచంద్రుండుదయించుటజూచి వాని చల్లదనమ్మునకు మనమ్మురుఝల్లుమన మెల్లనవానింజూచి యేమనిదూరుచున్నది.

క. మరుబారుకోర్వజాలక। పరితాపమునొందుచున్న భామినినన్నుం గరుణించకచలమునయీా। తరినిప్రతాపంబుజూపదగునాచంద్రా.

కమాచిరాగం-అటతాళం.

సోమాయింత్రాతామాసామా కోమాలులపై కోపామా రామా లలామాలయిట్లు రవ్వాసేయభావ్యమా॥ సోమాయింత్రా॥౧॥ కామీను లనేయగనిట్ట కఠినహృదయమేలరా స్వామీభూమిలోననీదు చల్లాదనమే మాయేరా॥౨॥ రాత్రీచరుడవుగనుకనీమది రాదూరా ప్రేమింపాను గా తాత్రిమెల్లాకంపా మొందెగదరా ఆత్రేయాపుత్రా॥౩॥ ధరనుబాహుబలేం ద్రపురిశంకరునిశిరమునసిలచియు నిరతమువానినమ్మినట్టి గరితననుకరుణిం పావు॥ ౪॥ సూరికృష్ణయనేలీనట్టి శూలికృపనాపైనున్న వారిజాప్తుతోడ జెప్పివంచనజేయింతుగా॥౫॥

గీ. నీరజాప్తునెదుటనెగడలేకనునీవు వానివలచినట్టివనితనన్ను, పలువిధ ములుగానుబాధించుచున్నావు వనితపైనిచలమువలదుచంద్ర.

క. కువలయమిత్రుడవయ్యును। కువలయమునుకొన్నినాళ్ళు కుటులుడవ గుచుఁ। కువలయనేత్రులనేచెదు। కువలయమిత్రుండనంగ కూడదు నిన్నుఁ.

అనిసాజ్ఞాదేవి మన్మధచంద్రులందూరుచు నామానినీమణి మరు తాపమపరిమితంబయ్యె గావుననెవ్వరైనవరునన్వేషించి తెచ్చువరకు నం తఃపురంబుననుండవలెను గానన్చటికరుగుదమటవే చెలియా.

చెలికత్తెలు॥ జనుదముపదవమ్మాజలజాప్తుకొమ్మా. అనిచెలికత్తె లుచేయిబట్టుకొని యంతఃపురంబునకుం జనియె. నచ్చట.

సంధి॥ సూర్యుండు నిజధామంబున సింహాసనాశీనుండై భటు నితో నేమనుచున్నాడు.

సూర్యుడు॥ యేమనుచున్నాడు- ఓపరిచారకా నీవతిరయంబున కస్యపాదిమునులకడకేతెంచి నేనుప్రార్ధించినానని విన్నవించిచెచ్చెర నా మహామునుల నిచ్చటికిందోడ్కొనిరమ్మురా భటాగ్రేసరా. [న్నాను.

భటుడు॥ స్వామీ అటులనేజేసెదను పోవుచున్నాను. పోవుచు

సంధి॥ భటుండుబయలుదేరి అరణ్యంబున మున్యాశ్రమములకుం జనుసమయంబున మునులుస్నానాదివిధులొనరించుటకు నదీతీరంబులకుం జనినవిధంబేమనిన.

పంతువరాళి రాగం.

వెడలిరీమునివరులు వేడ్కను జపములుసల్ప వెడలిరిమునివరులు వేడ్కను ॥౧॥ వెడలిరిమునువరులు వేడ్క పుడమిజనములుసంతసింప కడువడీగనుశిష్యజను లిరుగడలనునడుచుచునుండ॥ ౨॥ ఉరమునరుదాక్షసరములు విభూతినుదుట వరుసలుగను మెరయురేఖలు కరములనుజపమాలికలును కావివస్త్రముగోచిదండము విరివిగాధరియించిహరిను స్థిరముగనుచిత్తముననిలిపి॥౩॥ బాహ్యబలేంద్రునిపట్టాణా విశ్వేశ్వరుకృపబాగుగానుమదినిగోరుచూ సాహసంబుగాను శిష్య సమితితర్కవాదములను ఊహాపోహలుకొలదిజేయుచు నుభయపార్శ్వమ్ములనునడువగ॥౪॥

సంధి॥ వ॥ ఇట్లువచ్చి మునిశిష్యులు గురుశుశ్రూషం గావించు విధంబేమనిన.

ముని॥ వరేశిష్యా

శిష్యుడు—ఆయాస్వామీ

ముని—యీనదీతీరంబున నాసీనులమై జపమాచరించవలెను గాన తత్ప్రదేశంబును శుభ్రముగా బాగుజేయుమురా శిష్యా (స్వామీ

శిష్యుడు—అయ్యా యిచ్చటశుద్ధిజేయుటకు అపరిశుద్ధములు లేవు

ముని—కసవుమొదలైనవితీసివేసి యుదకముప్రోక్షించరా శిష్యా

శిష్యుడు—ఆలాగైతే పూడుస్తానుగాని పుప్పునీళ్లు లేవుస్వామీ

ముని—నిర్మలమగునదీజలంబుండ, క్షారోదకంబేలనురా శుంఠా

శిష్య—ఊడ్చిఉప్పునీళ్ళు చల్లవలెననుకున్నాను యీయుదకముపనికివస్తే చల్లుదునుస్వామీ

మునీశ్వరుడు— నీవుఊడ్చిఉప్పునీళ్ళుచల్లేవాడవా ఆలాగైతే బాగానేముందరకువస్తావురా.

మునీశ్వరుడు—శిష్యా ఉదకముగోమయమిళితము జేసిచల్లవలెరా.

శిష్యుడు—గోమయమనగాగుర్రపులద్దియేగాదాస్వామీ,

మునీశ్వరుడు—ఛీ అప్రాజ్ఞుడా గోమయమనగాఆవుపేడరా నీతండ్రిగొప్పసంస్కారి గాని వానికడుపుచెడపుట్టినావురా శుంఠా.

శిష్యుడు—సరే ఆవిధముగా జేసినాను స్వామీ.

మునీశ్వరుడు—అనుష్టానకాల మతిక్రమించుచున్నది గాన శ్రీఘ్రముగా శుద్ధిజేశిన స్తలంబున కృష్ణాజినమును బరుపరా.

శిష్యుడు—స్వామీ తమవద్దనున్న గొర్రితోలేనా స్వామీ.

మునీశ్వరుడు—గొర్రితోలుకాదు యిర్రితోలురా యింతమాత్రము తెలియదా భ్రష్టా.

శి—తమసెలవుప్రకారం పరచినానుస్వామీ

ముని—కూర్చుండవచ్చునా (నూ.

శి—కూర్చుండవచ్చునూ బద్ధకముగానుంటె పరుండనూవచ్చు

ముని—శివశంకర శివశంకర అనుచుకూర్చుండి పూజాద్రవ్యములనున్నూ భోజనపదార్థములనున్నూ సమకూర్చరా శిష్యా

ముని—శిష్యానేనుకూర్చున్నస్థలమందు చాలామెత్తగాయున్నది

శి—స్వామీ తమరుమహానీయులు పక్షిగుగాయలుయున్నవిగాని మరియేమీలేవు

ముని—అయితేయేమాయనుగాని మనకుపద్రవ్వలేదురా శిష్యా

శి—తమకుయేమికావలెనో మనవిచేసుకొనండిస్వామీ

ముని—పుష్పములు పత్రిమొదలగునన్నియు సమకూర్చరాశిష్యా

శి—అవియేమిటిస్వామీ

ముని—తుమ్మిపుష్పములున్ను కందమూలఫలములురా శిష్యా

శి—తుమ్మిపుష్పములు నేనెరుగనుగాని తుమ్మపువ్వైతే యీవూరిచెర్వుకట్టమీద చాలగానున్నవి తెస్తానుస్వామీ

ముని—తుమ్మిపుష్పము భూమికిజానెడెత్తున చిన్నిచిన్ని చెట్లునధవళాక్షతలవలె తెల్లగానుండునెరుగవటరా శిష్యా

శి—స్వామీఅవైతేతెచ్చెదనుగాని కందమూలమ్ములెక్కడుంటవి

ముని—అడవిలోక్రిందత్రవ్వితే దొరకునురా

శి—క్రిందవుండేవైతే పీకుతానుగాని మీకాలిక్రింద నేవున్నట్టు కనుపించుచున్నవి కొంచముకాలెత్తండిస్వామీ పీకుతాను

ముని—అదేమిటిరా అష్టాలంభావు అదికూడదురా

ముని—ఛీఛీ అసభ్యముగాసంభాషించెదవు నీవుఅకతాయివిగానున్నావేమిరా

శి—చిత్తముచిత్తము చిన్నవాడను తెలియకపలికినపలుకుల కాగ్రహించక క్షమింపుడుస్వామీ

ముని—హంసదండము అందివ్వరా (మీ

శి—యిస్తున్నానుగాని మీదండముమీరు గట్టిగ పట్టుకోండిస్వా

ముని—కమండలపాత్రలో నుదకము తీసుకురా శిష్యా

శి—కమండలు నాకుతెలియలేదుగాని తమాండాలు కనుపించుచున్నవి స్వామీ

మునీ—వాటిలోనీళ్లు తీసుకురావలశినది.

శి—వాటిలో నీళ్లు తెచ్చుటయెట్లు స్వామీ

మునీ—బుద్ధిహీనుడా కమండలువఅనగా మేముదగ్గరనుంచుకొను పాత్రయెరుగనటరా శిష్యా.

శి—నేనుఅంతవరకు చదువుకుని యుండలేదుస్వామీ.

మునీ—త్వరగాపాత్రనారాయము చెంతకేగి యుదకముతెమ్మూ.

శి—తమశెలవుప్రకారంతెచ్చినాను ఇక్కడఉంచినానుస్వామీ.

మునీ—సంధ్యావందనకాలమయినది సంధ్యచెప్పుతాను చెప్పుకోరాశిష్యా.

శి—మీదండము మీముందరపెట్టుకొని కూర్చున్నారు నాకు భయమవుతున్నది మీదండము నేనున్నూపట్టుకుంటాను.

మునీ—వోరేశిష్యా నీవువికటప్రలాపివి లాగనున్నావు యీసంభాషణలుమాని నేనుచెప్పినది చెప్పుకోరాశిష్యా॥

శి—అయ్యా తమనోట యేమాటవస్తే ఆమాటల్లా అనుమంటారాస్వామీ ఆమాటేరాశిష్యా.

మునీ—అట్లాగేచెప్పవలెను పరాకులేకవిని చెప్పినట్లుచెప్పుకో.

శి—చిత్తము చెప్పండిస్వామీ.

మునీ—ఓం విశ్వేశ్వరాయనమః.

శి—ఓ యీశరాయనమః.

మునీ—ఓరె వీశరాయికి నమస్కారముచేస్తావా బాగానోటపట్టి చెప్పుకోరాశిష్యా॥

శి—మళ్ళీచెప్పండీస్వామీ॥

ముని—ఓంవిశ్వేశ్వరాయనమః అనరా కుంకా॥

శి—ఓంవిశ్వేశ్వరాయనమః అనరాకుంకా॥

ముని—ఓహోహో అన్నమాటల్లా అంటున్నావు మహాబాగా వున్నదే॥ త్వరలో బాగుపడేవాడవే॥

శి—తాముచెప్పినదల్లా అనుమన్నాను గనుక అంటున్నాను చెప్పవలశినదియేదో చెప్పకూడనిదియేదో తెలియదుస్వామీ.

వ. ఇట్లు గురుశిష్యులు సంభాషించుకొనుతరిని సూర్యునివద్ద నుంచి భటుడొకడువచ్చి మునులంజూచి యేమనుచున్నాడు.

భటుడు—హేకశ్యపాదిమహామునులారా మాప్రభువుగారైన ప్రభాకరుడుగారు మిమ్ములనెందుకో ప్రార్థించి తోడుకొనిరమ్మన్నారయ్యా స్వామీ తడవుసేయక దయచేయుడు మునివర్యులారా.

ముని—బహుసంతోషము పరమానందము మార్తాండుడు మమ్మురమ్మని చెప్పినాడా యేమివార్త యంతో శ్రవణానందముగానున్నదే అప్పైతేవచ్చెదము నీవుముందుజని మునులువచ్చుచున్నారని విన్నవించుము. (అనిచెప్పిశిష్యునితో.)

ముని—శిష్యా సూర్యుడు మమ్ములనురమ్మనివర్తమానంపంపినాడు మేమువెళ్లెదము శి॥ నేనున్నావచ్చెదను—ము॥నీవుకూడావచ్చెదవా.

శి—శీఘ్రంబుగా వెళ్లుదము నేనున్నావచ్చెదనూ.

సంధి—అంతట శిష్యసహితంబుగా మునులువచ్చువిధంబేమనిన

తంగంపాట—దరువు.

శంకరభక్తా వశంకర శంకరశరణంటినినిను శంకరహితమూగా సాంబా యింకబ్రోవుమీశా॥ ౧ పార్వతీశహర పార్వతీశహర పరమ గుణాకర సార్వకాలమూనూ సాంబా సన్నుతిజేసెదాను॥ ౨ బాహు బలేంద్రుని పట్టాణాధీశుని సాహసమొప్పగాను సాంబా స్మరియించి వేడెదానూ॥ 3

వ. ఇట్లు శంకరుని స్మరణసేయుచు విచ్చేయు మౌనులంగని సూర్యుండెదురేగి వచ్చినమస్కరించి యుచితాసనంబులం గూర్చుండ నియోగించి మృదుళవచన రచనల వారికిట్లనియె.

సూర్యుడు — హే మానివర్యులారా మీరువిచ్చేయుటచే నాడెం దంబపరిమితానందంబునొందుచున్నయది నా దేహంబులు పవిత్రంబుల య్యె అయ్యలారా మీతోనొక్కచిన్న విన్నపంబున్నది అందులకై యిం దుమిమ్ములను రప్పించినాడ నామనోరథంబెరింగించెద గాన సావధా నచిత్తులరై వినుడుస్వాములారా.

మునీశ్వరుడు — వినిపింపుము భాస్కరా.

సూర్యుడు దర్వు నాదనామక్రియరాగం ఆదితాళం.

వినుడీనాదు మనవిని మునివరులారా వినుడీనాదుమనవినీ ఘనము గనాపైని కనికరముంచి వేగ॥ వినుడీ॥ ౧

యింతవరకునాయంతరంగంబున నెంతోస్థిరముగను కంతుశర ములనరికట్టితిగాని నాకింతులపై భ్రమమిపుడుగల్గెనయ్యా॥ వినుడీ॥ ౨

పుడమిగృహస్థాశ్రమముపూనినవారు పూజ్యులై ప్రబలుదురు కడుధన్యులై సుతులు గలుగగస్వర్గతి బడయుదురయ్యా పరమయో గులారా॥ వినుడీ॥ 3

ఆశ్రమములలోపలనుత్తమము గృహస్థాశ్రమమిలలో పల ఆశ్రి యించెదమిమ్ము నాయ్యలారా గృహస్థాశ్రమమిప్పించుడతి వేగంబున నాకు॥ వినుడీ।

బాహుబలేంద్రునిపట్టపుసతిమది బాగుగానెరనమ్మి యుత్సాహ ముతోడుత జనిమయుప్రత్రికనువీ వాహార్థమడిగినావనితానేయుడయ్యా వినుడీనాదుమనవిని॥

వ. అనివిన్నవించి మరియు నేమనుచున్నాడు.

గీ. పొలతిహీనమైన పురుషునియత్నమ। మభిగుగిసినట్టి యధికవృష్టి
కాననంబునందు కాయుచంద్రికసాన। క్రిందవన్నె గాదె కేవలముగ.

గీ. కలుములకునెల్లనెలవిల కన్యగాదే। గతులకును కారణముభువికాం
తగాదె। సుతులకును సాధకముధర సుదతిగాదె। భోగములకెల్ల
పుట్టిల్లు పొలతిగాదే.

గీ. వనితలేనివానివంశము వానితో। సరియెగాదె యంతచతురుడైన
దానవలనగాదె సకలసామ్రాజ్యంబు। ఘనమువంశవృద్ధిగలుగు నెల్ల॥

సూర్యుడు—ద్విపద॥ మునివరులార నాముచ్చటలెల్ల ఘనముగా నెం
చియు కరుణతోడుతను నాకోర్కదీర్చుడీ నయవిదులార ప్రాకటంబుగ నా
దు పరిణయమునకు కరముప్రీతిగ విశ్వకర్మపుత్రికను సరసగుణోపేత సౌజ్ఞను
దెచ్చి సముదార్చుడయ మునిసత్తములార సుమశరు బాణముల్ సూటిగా
వచ్చె నేనోర్వగాజాలనింతి లేకున్న పూనిచేయుడు పెండ్లి పుణ్యాత్ములారా॥
మునీశ్వరుడు—యేమని చెప్పుచున్నాడు.

గీ. ఇంత జెప్పనేల నీపాటి కార్యము। కేముజనగ సఫలమేల కాదు। సంతస
మునజనియు స్వామినీ కార్యము। చక్కజేతుమయ్య సారసాప్త.

మరియు ముని—నీమనోరథంబమోఘంబుగా నెరవేర్పంజా
లుదు మమ్మయపుత్రియగు సౌజ్ఞాదేవిని సమ్మదంబునం దెచ్చి నీకిచ్చి క
మ్మవిల్తు వేదనమ్ములు నిమ్మళింపం జేసెదమయ్యా భాస్కరా॥ సూర్యుడు॥
సఫలము జేసుకొని కడురయంబున రండు కశ్యపాది ప్రముఖులారా.

ముని—సెలవొసంగుము చెచ్చెర నేగెదము. అని సెలవుపుచ్చు
కొని జనునెడ మార్గంబునం గనుపించు నిమిత్తంబులేమనిన.

సీ. మంగళతూర్యముల్ మార్గంబులో మ్రోసె గరుడపక్షియు కుడిగాన వ
చ్చె। వాయసంబుచు వచ్చె వసన గాకుడికి నియరసి అగ్నియునెదురువ
చ్చె। మాంసఖండంబులు మరిమరి యెదురయ్యె నిరువురు బ్రాహ్మణు
లెదురుగాను। వచ్చిరి కన్నియల్ వరుసగా నెదురయ్యె వేశ్యలెదురైర
ప్పవేడ్క తోడ। నెదురుగా శుభశకునములిట్లుగాగ। వెడలియా వేళహి
మవంతునడవి జేరి। యందు చందన తాళ మందార సాల। వనములను జొ
చ్చిరా మునివరులు వేడ్క.

కండార్థణము శంకరాభరణము ఆటతాళం.

ఇటుజొచ్చి ఘనులడవిని। పటుతరమగు సింహవ్యాఘ్రశరభ భల్లూకము
లం। కిటికులముకృష్ణమృగములు॥ దిటముగనున్నట్టి వనము తీరుగాగను
చూ। యావనమున జేరి విహరించూ॥ కీరమయూర కోకిలబృందమ్ములు
చారుతరంబగు చక్రవాకంబులు। మీరి శారికలెల్లగుములై కోరికలరగ
గూయుచుండగ। సారవంతంబైన నమృతపూరమగు నొక సరోవరమును॥ దీ
రముగాగనిగూ। యావనమూను జేరి విహరించూ॥

రయ్యెను చతురముగ పశువుగ వ్రేల్చెను॥ ముని॥ ౨

ఇలలో బాహుబలేంద్రపట్టణ సేయుశివుకృపను యలమితో డ త్రేతాగ్నులను త్రికూట తలమునానిల్పియాతరినివిశ్వకర్మ విలసి తంబుగ యజ్ఞపూర్తియు కలుహరునాహరునిగూర్చియు చేసెనేమియు లేక జేసెనుపలువురను మునివరులగూర్చి" ముని॥ 3

వ. ఇట్లాకశ్యపుండు త్రికూటపర్వతమహాత్మ్యముం జెప్పిన విని మును లందరారాత్రి యచ్చోవసియించి ప్రభాతంబున నాయాశ్రమంబు విడచి కిడురయంబునంజని చని.

ఉ. క్రౌంచనగంబునుంగడచి గాఢతమంబగు కాననంబులో
కాంచనదారు కావనము కాఱుమెకంబులు పక్షిజాతులన్
కాంచుచునాశ్రమస్థలుల కందఫలంబులుగొంచు ప్రీతితో
కాంచనచేలుదివ్యపద కంజములన్ మదినుంచిభక్తితోన్.

వ. ఇట్లు హరినిస్మరియించుచు కుబేరుని యుద్యానవనమ్ముజేరి చైత్రరథంబుం బ్రవేశించి అందుకుబేరునిచే పూజితులై దివ్యాంబరాభరణంబులుగొని యిదియరాబోవు భాస్కరు పరిణయమ్మునకు శుభసూచకంబనియెంచి మానులందరు కశ్యపుంజూచి యేమనుచున్నారు.

మునీశ్వరులు — ఓకశ్యపముని శ్రేష్ఠా ఈచెంతనుండు వనములందెంతెకు వింతలగువిటపంబులచే కన్నులపండువై వెలయుచున్నవి చూడుడుస్వామీ.

సంధి—అనుచువెడలి మఱియును.

సీ. నిత్యముమునులకు నిర్మలవాసస్థానమైనాకభూధరమహిమదెలసి, గరుడసిద్ధసాధ్యగంధర్వ ధురంధరులైనట్టి విపినమునకైజూచి, కపిలాశ్రమము నప్పుడుగని మొక్కి వేగమె సారస్వతీక్షేత్రస్థానములగుచు, ఖచరవిమానని కాయంబుదర్శించి కుష్ఠరులో రాక్షసకోటిచూచి, సకలమునిజనవాసమైచందనాది తరుకదంబంబు చేనిండితావులెల్ల, వెల్లడిగనాసకింపులై వెలయునట్టి గంధమాదననగమప్డు గనిరివారు.

ద్విపద. మధ్యమావతీ రాగం.

చందనమందార సాలహింతాల కుందబృందంబులు కోమరొప్పగలిగి నవనీతపిండంబునమృతఖండంబు రవిబోలుతేజంబురమణతో

గల్గి నవరత్నములకాంతి నల్గడలవెలయ ప్రివిమలస్ఫాటికోపలములుగలి
గి యిందుసానువులచేనింపెనయజేయు మందరాచలమును మరిసంతస
మున పొందుగానీక్షించి పుష్పగుచ్ఛంబు లందున్న పొన్నలనావేళజూచి
విగతరాగులమాని వితతిసచ్ఛీలు లగుశాంతులగువారి నానగరమందు
కనులారనచ్చోట గనిసంతసమున చనిచని కౌమార సంభవంబైన ఘన
మైనశరవణ గ్రిక్కునదాటి కౌశికానదియును కడువడిగడచి ఆశతోడు
త నుత్తరాశ్రిమాద్రియును చేరియుసంతుష్ట చిత్తులై వెలసి ఆరయవా
లఖిల్యాది మునివరుల చేపురస్కృతలయ్యుచెన్నొందగాను తాపసోత్త
ములచేఁ తగువిధంబుగను ఆతరినాతిధ్యమందియంతటను వైతరణీనదీ
వడసగాదాటి ఉత్తరకురుభూము లొప్పగాజేరి చిత్తమురంజిల్ల శివశి
వాయనుచు తపమొనరించెడి తాపసోత్తముల కపటశూన్యుల విగతక
లుషసంచయుల నౌదార్యశీలుల నతిసన్మపరుల వాదరహితుల మునివ
రులచే నచట కందమూలంబుల గైకొనివారు పొందుగాప్రీతితో భుజి
యించిచేగ ముదముతోజని కపిలమునియాశ్రిమముకు సదమలచిత్తు
లై సరసినిజేరి యందుకృతస్నానులై వేగలేచి అందమౌరత్న కీలాల
కంబనెడు రత్నాశ్రియంబగుచు రమ్యమౌనదిని యత్నముగాస్నానమా
చరించియును పుణ్యాశ్రిమంబులు పుణ్యదేశములు పుణ్యవనంబులుపొం
దుగాగడచి.

వ. అంతట పెందోటపట్టణ సమీపంబునకుజని దానిసౌందర్యం
బేమని వర్ణించుచున్నారు.

మధ్యమావతిరాగం ఆదితాళం.

పెందోటపట్టాణమదిగో దానియందాముగనుగొనుడిదిగో సుం
దరమైయుండు చూడుడీమునులార అందమైనప్రాసాదమ్ముల శిఖర
ముల్ యందుజూచినటెక్కెములు నీతెందుమయ గోపురవితానము ఘం
దసంపెగకుసుమములు వనబృందములు దండవిలసిలు॥ పెందోటపట్టాణ॥

నింగితోమాన్కొనజాలు గొప్పబంగారుకోటాలతీరూ రంగైన
పర్వతరాట్టులనగ మాతంగంబులాపురీ దరినివిలసిల్లును మంగళతూ
ర్యములుదిక్కులుమారు మ్రోతలు పెట్టుచుండగ గంగయమునలబోలు
నట్టితరంగిణులు చెంగటభాసిల్లు॥ పెందోటపట్టాణా॥

పురవీధులందమేమయ్యా। స్వర్గ పురమునకేనయగునయ్యా ఇరుగడలనుఫలతరు కదంబంబులు కరమనురాగముగల్గించుచుండెను సరసముగుణకలకంఠకీరశారికలరవములటుమ్రోయగ వరుసనుధ్యానములనాపురీతరుణులాడుచుపాడుచుండెను॥ పెందోట॥

ధరనుబావాలుబలేంద్రునీ పురీ ధాముడైనవిశ్వేశ్వరునీ గురుతుగ మనమునగొల్పుననమ్మిన కరమొప్పమనకోర్కెకడువేడ్కసఫలమా సరగుననుజనివేగనామయు సన్నిధికిమనమందరము బాస్కరునికోరికదెల్ప కన్యను సవినయంబుగనొసగునిప్పుడు॥ పెందోట॥

వ. ఇట్లువితర్కింపుచూ యాపట్టణంబునంగల వైభవంబెల్ల నేత్రానందంబుగాజూచుచు యొక్కశుభముహూర్తంబున పురంబుం బ్రవేశించి యేమనుచున్నారు.

సీ. వేదపఠనములేని విశ్వకర్మలులేరు వివిధశాస్త్రంబుల వెలయువారు
రణమునబారని రాజపుత్ర్యులులేరు శూరులై రౌద్రంబు జూపువారు
అర్థవంతులుగానిఆర్యులచ్చటలేరు కోటిమూల్యంబైనకూర్పగలరు
పాడిపంటలులేనిపదజులచ్చటలేరు పశుధనంబులచేత ప్రబలువారు
జారచోరాదిక్రూరులేజాడలేరు। దుష్టవర్తనగల యువతులును లేరు
కఠినభావముగలవారు కానరారు। మయునిపట్టణమహిమసామాన్య
మగునే.

క. మయురాజ్యమధికకాంచన।మయమైవిద్వజ్జనాభిమతమైవెలయున్।భ
యహరమై ప్రజలకునా।మయరహితంబగుచునొప్పుమహిలోనెప్పుడున్.

వ. ఇట్లు పెందోటపట్టణరాజవీధులనిరుగడలంగల సౌధంబులం జూచుచు నిర్మాణకుశలులగు శిల్పాచార్యులనేరుపుం గొనియాడుచు మయునిమందిరంబు దరియంజేరి మునులుమొగసాలనున్న రత్నపీఠంబులనధిష్ఠించియుండ మయునిసభామధ్యంబునుండి వెలువడి వాసవుండువచ్చువిధంబెట్లనిన.

ఖమాచిరాగం.

వాసవుడువచ్చెన్ మయునిసభనువెలువడి వాసవూడువచ్చెన్॥ వాసవుడొచ్చెను భాసురముగశాభాసనిజనములుబాగుగబాగడగ॥ కోటిసూర్యదీప్తులపాసియించ మణికిరీటమాశిరమునమెరయ నీటుమీరభుజకీ

స్త్రులు వెలుఁగఁగ వాటము దాటియు నడిగ నడుచుచును॥ వాసవుఁడు॥ ౧
వేత్రహస్తులు పొగడఁ ననుదినము సుందరభట స్తోత్రములును జెలఁగ
గాత్రమునను మణిమయ హారములు చిత్రవర్ణములు చెలఁగుచు మీరఁగ॥ వాస॥
ధరను బాహుబలేంద్రపురీ ధామునికి రణనుగోరి హరశంకర శ్రీ
హరహరి యనుచును మరిమరి శంభుని మనమున దలచుచు॥ వాసవుఁడు॥ ౨

వ. అనియిట్లు ఇంద్రుండు వెడలివచ్చి ద్వారంబుననున్న కశ్యపాదులంజూచి ఇంద్రుండు హే మునీంద్రులారా నేనింద్రుండ సాష్టాంగ దండప్రణామం బాచరించుచున్నాడను స్వామీ.

మునీశ్వరులు యేమనుచున్నారు—దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనశిద్ధిరస్తు నిరంతరం స్వర్గనివాసశిద్ధిరస్తు ఇటులదీవించిన మునీంద్రులతో దేవేంద్రుండేమనుచున్నాడు.

ఇంద్రుండు—అయ్యా మీరిచ్చటికి విచ్ఛేసిన కారణంబేమి చెప్పెరనా కానతిండు.

మునీశ్వరులు—హే పాకశాసనా లోకబాంధవు పరిణయార్థమై మయబ్రహ్మకుమారి నడుగవచ్చియున్నారము మీరిచ్చోవిచ్చేసియుండుటచే మాడెందంబు లపరిమితానందంబు నొందుచున్నవి సూర్యుని కార్యంబు సఫలంబగుటకు మీసందర్శనం బశుభసూచకంబు అని మునీశ్వరులు తమరాకకు కారణంబెఱింగించె నాసమయంబున మయబ్రహ్మ సభాస్థలికేతెంచు విధంబెట్లనిన.

మధ్యమావతి రాగం.

మయుఁడా సభకూవచ్చె మంత్రులతోడ మయుఁడా సభకూవచ్చె మయుఁడా సభకూవచ్చె మన్ననతోడ నుభయపార్శ్వమ్ముల వేదపాఠకులతోడ॥ మయుఁడా సభకువచ్చెనూ మంత్రులతోడ॥ ౧ చారులిడు గడలందు వింజామరలు కోరికలరగ వేత్రియ శూరులు ఆయుధధారులై వెంటాను కూరిమితోడుత చేరి ముందరి నడువ॥ మయుఁడు॥ ౨ పంచదాయీల హాగతము సాధనములలెంచి కిరములబూనియు అంచితము గనియమింపవలు చేతుమంచు తమ ప్రజలెంచు మాకొను చూరాగ॥ మయుఁడు॥ ౩ ధరను బాహుబలేంద్రుని పురవాసుడైన దైవమును నమ్మి

మఁడసీ పరిజనములకూను బహువిధములు గాను పరిపరివిధముల పనులు నియమించుచు॥ మయుడు॥ ర॥

సంధి— ఇట్లువచ్చి మయుండు సింహాసనాసీనుండై యున్న సమయంబున దేవేంద్రుండు మరలివచ్చినంజూచి మయుండేమనుచున్నాడు.

గీ. మరలివచ్చిన హేతువేను య్యెయింద। దాచకనునీవిప్రుడుసెలవిం డుదయనునాకు। సావధానుడనై విందుసచ్చరిత్ర। వీనులకువిందు సేయుడీ వేగిరముగ.

వ. అనియడిగిన దేవేంద్రుండిట్లనియె.

గీ. భానుకార్యార్థమైవచ్చిబ్రహ్మఋషులు। వాకిటనునిలిచియున్నా రు వాంఛతోడ। కర్ణములతోడుతవారలగౌరవించి। కార్యసాఫల్య మును జేయుకడుముదమున.

వ. అప్పుడుమయుండు భృత్యులారా॥ భృత్యుడు ఏమిస్వామీ॥

మయుబ్రహ్మ యేమనుచున్నాడు॥ మీర లతిత్వరితగతిం బోయి ద్వారమందున్న కశ్యపాదిమునీంద్రులను గౌరవంబొప్ప ప్రార్థించి కడు నయంబునందోడ్కొనిరండు॥ భృత్యుడు చిత్తముస్వామి అలాగే చేసెద ము అనిభృత్యులుజని వారలనుగని.

భృత్యుడు—ఓకిచ్చవచ్చ మునీశ్వరులవారూ

మునీ— ఓరినీవెవడవురా తొందరమారుగా బల్కుచున్నావు

భృ— నేనుమయబ్రహ్మగారి సేవకుడను అయ్యాతమపేరేమండీ

మునీ— కశ్యపమునీంద్రులు

భృ— ఆమాటనోటపట్టజాలక పలికినపలుకులు గాని వేరుగాదు గాన కోపగించకుడుస్వామీ

మునీ— అయితేసరే గాని నీవెందుకువచ్చితివిరా భృత్యా

భృ— మామయబ్రహ్మగారు దేవేంద్రమహారాజుగారివల్ల తమ రాక విని తమనుత్వరితమ్ముగ సభకుంటోడ్కొనిరమ్మని విన్నవించినార యాస్వామీ

మునీ—శీఘ్రముగావచ్చెదము పదరా భృత్యా

వ. ఇట్లుగూడలుబయులు వెడలి గంధశిందురమదగంధబంధురం

బులగు బహిరంగ ప్రదేశంబులును ధ్వజస్తంభగుంభితంబును నవరత్న ప్రభాభాసమాన వితానమండితంబులగు ముఖమంటపంబులును కనక దండాగ్రమండిత నూతనకేతన పవనోద్ధూతనీరదంబులయిన యున్నత సౌధంబులును విపక్షపక్షనిక్షేదనా దక్షాక్షీణబల భటాధ్యక్షరక్షితంబుల కక్ష్యంతరంబులును గడచి బ్రహ్మరుద్రేంద్రాద్యమరబృందంబులచేతను సకలకళాకోవిదులగు వేదవేత్తలచేతను వందనంబులు సేయుచు సుగుణ గణనముం గావించెడు వందిమాగధులచేతను అనల్పశిల్ప కల్పనానిపుణులగు శిల్పాచార్యులచేతను నలుదిశంబులం బరివేష్టించియుండ రత్నకనక కిరీటాలంకృతుండై మణిమయపీఠంబున నధిష్ఠించి యుండిన మయబ్రహ్మ సభామధ్యంబునకేతెంచిన మునులంజూచి మయుండపరిమితానందమయుండై యేమనుచున్నాడు.

మయబ్రహ్మ—మునీశ్వరులారా సాష్టాంగదండప్రణామంబులు స్వామీ.

మునీశ్వరులు—వంశాభివృద్ధిరస్తు నిరంతరంధర్మసిద్ధిరస్తు భవన్మందిరేశీఘ్రమేవశుభంపరంపరావాప్తిరస్తు.

మయ—అయ్యా! యీరత్నపీఠంబులందధిష్ఠించుడు స్వామీ.

మునీ—కూర్చునుచున్నాము మహాదేవ మహాదేవ యని కూర్చుండియున్న సమయంబున.

మయబ్రహ్మ—ఓమునీశ్వరులారా మీయాశ్రమంబులం దగ్నిహోత్రాది కృత్యంబులు నెరవేర్చుకొనుచు అతిథి సత్కారంబాచరించుచూ శిష్యవర్గంబుతో సుఖంబుగనున్నవారలేనా స్వామీ.

మునీ—స్వామీ తమయనుగ్రహంబున నేలోపంబును లేక సుఖంబుననున్నవారము స్వామీ.

దరువు-విశహరిరాగం.

యందుకై వేంచేసినారూ మీరలెందుండియిటకొచ్చినారూ సందేహించకనాతో సరగూనాదెల్పుడీ ముందూగామీకార్యమును నేపొందుబరచెదనయ్యా వేగమె॥ యందుకై వచ్చినారూ మీర॥ ౧ నాకెంతోసంతోషమాయెను మిమ్మేకకాలమూనజూడగనూ ఏకార్యమునకై

మీరిచటికే తెంచితిరో మీకటాక్షేక్షణమూనాపై సోకానివిధుడానతివ్వారోగ యం॥ ౨॥ పాపసంచయమెడబాసెనూ మీరూపంబులనీక్షించగనూ తాపసోత్తములార దయచేవచ్చినకార్య మేపుమీరగదెల్పి నామదికింపు వాటిలసేయుడింకనూ॥ యం ॥౩॥ ధరనుబాహుబలేంద్రుని పురీ ధాముడై నవిశ్వేశ్వరుని మరువకమనమునమరిమరిదలచిన సరగుననుమనకోర్కె లెల్లగను సఫలముగా జేయునిజముగ॥ యం ౪॥ (న్నారు.

వ. ఇట్లుపల్కుచుండెడు మయునింజూచి మునీంద్రులేమనుచు

మునీశ్వరులు॥ ద్విపద. వినుముమయ బ్రహ్మవిశదంబుగాను పని బూనిరాగ లైభవ్యచరిత్ర మూడులోకంబులముఖ్యంబుగాను యీడు లేని ప్రతాపుడినుడనవినవే వానికార్యార్థమైవచ్చితిమయ్య పూనిమీ కృపగోరిపూషణుడిపుడు మమ్మిచ్చటికిబంచెమరికోర్కెదీర సమ్మతిదాని సమకూర్చుమయ్యా.

వ. అనివిన్నవించినసమయంబున నామయబ్రహ్మ బ్రహ్మఋషు లయిన కశ్యపాదులతో నేమనుచున్నాడు.

మయ–ఏఋషీశ్వరులారా లోకబాంధవుండగు నా ప్రభాకరునకు నాచేకాగలకార్యం బేమియున్నదిస్వామీ సెలవొసంగితిరేని చేతనైనవు నిమైనచో చేయుచున్నాడను. (మునీశ్వరులు యేమనుచున్నారు.)

గీ. భాస్కరునకింతవరకునుపరిణయంబు। లేదుగావునమమ్ములనిచ్చ టికిని। బంచెనీవేళమీపుత్రిపద్మనేత్రి। నడుగనదెవచ్చుటకుకార ణంబువినుము.

మయ—హే మునీంద్రులారా మీరెంచినకార్యంబున కించుకైన సందియంబుండదు దైవఘటనమెటులున్నదో తెలియదుగదా నా పుత్రియగు సౌజ్ఞతరుణవయస్కురాలగుటంజేసి పరిణయమ్మునకిదియ తరుణమైయున్నది త్రిలోకారాధ్యుండగు తరణిజగచ్చక్షుండగుటంజేసి నా పుత్రిక నీక్షించియుండవచ్చును అట్టిప్రభాకరునకు కట్టినిచ్చుటకంటె నింకేమిభాగ్యంబున్నది అయినను బంధుమిత్రకళత్రాదులతో నాలోచించి వచించెద నిపుడుమధ్యాహ్నమాసన్నమగుచున్నది గాన అంతఃపురంబునకు దయచేయుడుస్వామీ.

వ. అని దేవదానవ బృందంబులకును భృత్యామాత్యులకును సెలవొసంగి మహానుభావుం డొడ్డోలగంబు విడిచిపోయి స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చి నవవిధ పంచభక్ష్యపరమాన్నంబుల పరితృప్తులంగావించి సతీసహితంబుగా మునివరులం బూజించి తానును బంధుమిత్రవర్గంబులతో భుజియించి అనంతరంబున సభకేతెంచి బంధుమిత్రకళత్రాదులతో నాలోచించువిధం బేమనిన.

కందార్థకము. మన సౌజ్ఞకు నావ్యాఘ్రాం। బునకవసరమయ్యె నిప్పుడు పూనియు మీరలు। జనిపరుని న్వేషించుండని। జైష్ణగదలచియుంటి నయ్యా యీవేళ మునులీకార్యమునకునై రాగ మనమునాకమితసంతసమాయె నీవేళ ఇనుడుదయించినట్లు మిమ్ము నిటులానుబంధించె॥ నయ్యా॥

వ. సహస్రాక్షుపుత్రుఁ డొప్పదగుండగు నసహ్రాంశుండు నాసుత యగు సౌజ్ఞాదేవిని సతిగా నిమ్మని యతి రుచిసంపెగా వున మీయిష్టము ద్వాచక్ర స్పష్టముగా దెల్పుడు. బంధుమిత్రులారా బంధువులు యీవార్తవిన్నది మొదలు మానసంబు లానందాబ్ధి నోలలాడుచున్నవి త్రిలోకారాధ్యుండగు నాకమలాప్తుంగూర్చి నీకమలాక్షిని కమలాసనుడే సృజియించె కాబున్న నీసతీలలామయగు సౌజ్ఞాదేవి సౌందర్యంబెట్లు సఫలంబగును.

వ. అనిచెప్పుడు సమయంబున మయబ్రహ్మ గృహిణియగు శాంతాదేవి యేమనుచున్నది.

సీ. సంతతిలేకను చాలనోములునోచి కొన్నాళ్లకీముద్దుకూతుగంటి। సుకు
మారనీ రెండసోకినదేహము కందునెరుగదె ప్రుదుకష్టములను। తాప
సులడిగితే తపసుకిచ్చెదనంచు జెప్పగా నామదిచింతపొడమె। ఇల్లువా
కిలియు లేదెల్లపుడు సంచారమేగాని నిల్పడు నిమిషమైన। అట్టిభానుని
పత్నియైనట్టి సతికి। నిలుకడచొప్పె టసుఖమెట్లు నిశ్చయముగ। తపనువే
డిమి కేవిధితాళనేర్చు। ఇన్నికష్టంబులకు కన్నెనెట్లులిత్తు
గీ. కన్నెయత్తింటికష్టములీక నినసతికి। గాకవినువారికేగతి కానవచ్చుకష్ట
ములుపాలుసేతురేకన్నవడుచు। కన్నకడుపెట్లులుండు దుష్కరుని కివ్వ.
సీ. సప్తాశ్వరధముపై సరసనిడుకొనిరవి ముచ్చటలాడు నీముగ్ధతోడ
రాత్రించవడుగాదు రమణితోడనుగూడి కేళ్లెల్లతాసుఖలీల మెలగు

నింగినుండియుపద్మినీవనంబులకును మిత్రుడై సంతోషమివ్వలేదె
సారసాప్తుండయ్యుసత్పథసంచారి సతికెపుడుసౌఖ్యముజరుపకున్నె
లోకబంధుడుగాడెసరోజవదన। మూడులోకంబులేలెడిమూర్తిగాడె
కాంతరవికిన్వకష్టమేగలిగినిగలుగు।కులముకలుగజెడదనికువలయమునా.

క. రవిచంద్రతారకలు। యీభువిగలకాలంబునుండుపుణ్యులుగారే। ర
వికొసగినసుతకుసు। నైదువతనమెస్థిరముసుమ్ము తోయజనయనా.

వ. అనియీవిధంబున సమాధానంబు జెప్పినపతిపలుకులకు సతియాసమ్మతించెనాసమయంబున మయుండు సభాస్థలియున్న యింద్రుంజూచి మీయిష్టంబేమనియడిగిన జిష్ణుండేమనుచున్నాడు॥

ఇంద్రుండు. హేమయబ్రహ్మ నీపుత్రియగు సౌజ్ఞాదేవిని సూర్యునకొసంగిన నీయశంబు సూర్యమండలమునతిక్రమించి ధృవమండలంబువరకు బోవును నిదియధ్రువంబు అనిమరియు.

చ. ఘనముగవిన్నవించెదను గౌరవమొప్పగ జిత్తగింపుమీ।
దినమణికిచ్చినీసుతనుదివ్యులమెచ్చగ పెళ్ళిజేసినన్।
జనములుసంతసింతురు నిజంబుగపెద్దలుస్వర్గమొందనీ।
వనరుహ నేత్రిమూలమున వంశముఖ్యాతివహించునోమయా.

అంతమయుండేమనుచున్నాడు.

సీ. తమ్ముడనుచునిట్లుతగజెప్పగాలేదు। నిజముబల్కితయ్యనీవుచక్రి। ము
నులయభిప్రాయమునకునుసరియాట।సుతనొసంగువాడసూర్యునకును.

వ. యిట్లుబల్కి మయుండు ఇంద్రసమీపంబుననున్న మునీంద్రులతో నేమనుచున్నాడు.

ద్విపద॥ వినుడుమునివరులార విన్నవించెదాను ఘనముగానెంచుకరుణతోడుతను ధరస్వయంవరముకు తగురీతిగాను వరభూపతులనెల్ల వరుసరావింప వారిలోనెవరిని వరియించువాని చేరివివాహంబు సేయదలచితిని పరమయోగులుమీరు పనిబూనిరాగ మరుమాటజెప్పగా మనసొప్పదయ్యె ఇదిగాకకశ్యపుండీకార్యమునకు సదయుడైయీవేళచనుదెంచినాడీ మునిపుంగవుడుపుణ్యమూర్తితావచ్చి ఇనునకునాసుతనిమ్మనియడుగ యీకున్ననాకెపకీర్తియగాదె యీకారణంబుననివేళసౌజ్ఞాభానునకొసగియీపరిణయంబిపుడు పూనిసేయుదునయ్యపుణ్యాత్ములారా.

వ. ఇట్లుమయుం డానందమయుండై పల్కిన నామునివరులేమ నుచున్నారు.

క. నీసుతసౌందర్యమునకు। నాసూర్యునితేజమునకు నజుఁడేకూర్చెఁ
భాసురమగు రత్నమ్మును। కాసులబంగారుతోడఁకట్టినరీతిఁ.

నాటకురంజిరాగం అటతాళము.

మదికింపాయెనయ్యా మయబ్రహ్మగారు సదమలమతివీవు సరసూఁడావయ్యా. ౧

ప్రజాపతులలోన ప్రముఖుఁడవయ్యా సుజనారాధ్యుడవుసుశీలుఁడావు
సూర్యునకీ వేళసుతనడుగగానేధైర్యముతోడవాగ్దానమిచ్చితివి ౩
నీపుణ్యమేమయ్య నిర్మాణనిపుణా నీపుత్రికసౌజ్ఞ నినునకిచ్చితివి.
ఇలలోనుబాహుబలేంద్రపురశివుడుపలుతెరగులనుదంపతులబ్రోచునుత

వ. హేకశ్యపమునీంద్రా తాముసర్వజ్ఞులు గావున తగుసుముహూర్తమువిచారించి లగ్నమునిశ్చయింపుడయ్యా.

మునీశ్వరులు॥ మంచిది మంచిది అలాగేనిశ్చయింతము తాము మాప్రయత్నముసఫలముగావించినందుకు పరమానందభరితులమగుచున్నాము అనుచుమయబ్రహ్మంజూచి॥ మునీశ్వరులు॥ అయ్యామీకుమార్తె సౌజ్ఞాదేవికిన్ని సూర్యునకున్ను గోసాశీసూ శతభిషమున్నాగనుక నామనక్షత్రమొక్కటెయయినది వారియుభయులకు తార సంపత్తారచంద్రుఁడేకాదశమందున్నాడు గానవివాహం బీముహూర్తంబునకేకావలెను.

గీ. ఝెల్లియొకలగ్నమున్నది యింతకన్న। మంచికనుపించలేదయ్య మాన్యచరిత। అతిరయంబునకార్య సన్నాహకులను। బంపియత్నముసేయుఁడీ పరిణయమునకు॥ అంతమయుండు॥

వ. అయ్యామీవాక్యంబు లమోఘంబులుగావున నాలాగేశుభకార్యమ్మునకు నుద్యమించుచున్నాడను.

మయుడు—భృత్యా

భృత్యుడు—యేమిస్వామి

మయబ్రహ్మ నీవతిత్వరితగతిబోయి మనపురోహితుండగు త్వష్టబ్రహ్మను వెంటబెట్టుకొని రమ్ము వేగంబునబొమ్ము॥

భృత్యుడు చిత్తము చిత్తము అలాగుననెవెళ్ళుచున్నాను అనిబ

యలుదేరి పురోహితుని సన్నిధానంబునకుంజని.

భృత్యుడు ఓఅయ్యగారు మిమ్ములను మాయబ్రహ్మగారు పిలచికొని రమ్మన్నారండీ॥

పురోహితుడు॥ మాదాతగారిసెలవయినదా అట్లైతే తక్షణము వచ్చెదను భృత్యావారుపిలిపించినందులకు కారణమేమో నీకేమయినా తెలియునా॥

భృత్యుడు—నాకుఅంతవరకు తెలియదుస్వామి॥

పురోహితుడువచ్చినిలచి। గీ॥ యేమికారణమున నిపుడురప్పించిరి। విశ్వకర్మవంశవిమలరత్న। అనతియ్యవయ్య యిటసంతసమ్మున। వచ్చి నిలచియున్నవాడనయ్యా॥

మయబ్రహ్మయేమనుచున్నాడు—స్వామి॥ యీసింహాసనముపై గూర్చుండుడు॥

పురోహితుండు॥ అలాగున నేకూచుండెదను అనికూర్చొనుచున్నాడు.

మయబ్రహ్మ॥ గురువర్య సాష్టాంగదండప్రణామంబులుస్వామీ॥

పురోహితుండు నిరంతరంధర్మసిద్ధిరస్తు శీఘ్రమేవ శోభనపరంపరావాప్తిరస్తు॥

మయబ్రహ్మ॥ గీ. నాదుపుత్రికసౌజ్ఞను నవవిలాసి। ఇనునకిచ్చుటకును నిశ్చయించినాడ। కశ్యపులవారితోడను కలసిమీరు। శుభముహూర్తమునిశ్చయించుడుముదమున.

అనిమయుండానతిచ్చిన పురోహితుండేమనుచున్నాడు॥ పురోహితుండు స్వామీ కశ్యపమునీంద్రా వందనము నేనుమయపురోహితుండ తమకుపుత్రతుల్యుండ తమదయకు పాత్రుండ తమదర్శనంబున నీవేళ ధన్యుండ అయ్యా మాదాతగారయిన మయబ్రహ్మగారి కుమార్తెయగు సౌజ్ఞాదేవిని సూర్యునకిచ్చి వివాహంబుసేయ నిశ్చయించినారట తమతోనాలోచించి శుభముహూర్తము నిశ్చయింపుమని మయబ్రహ్మగారు సెలవిచ్చిరి గాననావిధమున గావింపుడుస్వామీ॥

కశ్యపుడు॥ మాటలు అడుగడము॥ నీవా త్వష్టప్రజాపతివా నిన్ను నేనిదివరకుజూచియున్నాను చాలసంతోషముగా నున్నది బాలజోష్యము వృద్ధవైద్యమన్నాడుగనుక నీవునాకంటె చిన్నవాడవు బాగాపరి

శీలించి చూడుము యెల్లుండియొకలగ్నమునిశ్చయించినాము అనికస్యారు డు చెప్పినదరకు॥

పురోహితుండు కొంచెమువిచారించి బహుయోగ్యము నన్న ది తమవంటి పెద్దలువిచారించినదాని కెద్దియు లోపముండదు తారా చంద్రబలంబులు తగువిధంబుగానున్నవి॥

వ. అనిచెప్పి మునీంద్రులవద్ద సెలవుపుచ్చుకొనివచ్చి పురోహి తుండు ఏమయబ్రహ్మగారు.

మయబ్రహ్మ॥ గురువరా॥

పురోహితుండు॥ నేనునూ శశ్యపాదులునాలోచించగా నెల్లుండి యెయోగ్యమయిన లగ్నంబొకటికుదిరినది తగుయత్నము చేయించియా ముహూర్తంబునకే కార్యముసమకూడునట్లు చేయుడు స్వామీ॥

మయబ్రహ్మగారు ఆయత్నములోనున్నాడను అవిధంబున గా వించెదను స్వామీ॥

మయబ్రహ్మగారు॥ భృత్యులంజూచి భృత్యులారా మీరువేగం బుగ నరిగి మనబంధువర్గంబులకెల్ల నీవర్తమానము దెలియంజెప్పి సత్వ రంబునందోడ్కొనిరండు అందుకుకావలశిన రథగజతురంగంబుల నా యత్తంబు జేసికొనిపొండు॥

భృత్యుడు చిత్తము స్వామీ యనికొందరుజనుచున్నారు.

మయబ్రహ్మ॥ మంత్రులారా యీవివాహమునకుం గావలశిన మంటపంబులు పెళ్ళిపందిళ్లు వీథివిధంబుల నలంకారము చేయించి పురజనులకందరకు వెల్లడియగునట్లు చాటింపుజేయుడయ్యా సత్వరంబె నజాగుసేయకుడు ఇంతియగాక యీశుభకార్యంబునకు రావలశినదికావ లతుల నానాగాదిపంచబ్రహ్మలు సామదితరాజులు మొదలగు వారికి శుభలేఖలువ్రాసి భటవర్గంబులచే బంపుడు మరియును వివాహంబునకు కావలసినసమస్త వస్తుజాతంబులను సిద్ధపరచడు॥ మంత్రులు స్వామీ తమసెలవుప్రకారముగావించెదము ఆయాకార్యంబులు నందరిననేకవి ధంబులనియోగించెదము సెలవా సంగూడుస్వామీ॥

యిక్కడనుంచి హాస్యము చెప్పుదుము.

హాస్యగాడున్నూ—ఒకబ్రాహ్మణున్నూ వచ్చుచున్నారు.

హాస్యగాడు—ఓహోహో మీరెవరండి మిమ్మెనెప్పుడో చూచి నవారలాగ కనుపించుచున్నారే॥

బ్రాహ్మణుడు—ఓకరికొకరు చూచున్నట్లే యున్నాముగాని నాకునుగుర్తు లేదు॥

హాస్యగాడు—మీయింటిపేరు ఏముండయ్యా॥

బ్రాహ్మడు—మాయింటిపేరు నేతివారు అసమీకుమాకు దగ్గిర బంధుత్వమె మీరు మేము కలుస్తున్నవారమె॥

హాస్యగాడు—మీగోత్రమేమండీ॥

బ్రాహ్మడు—మాగోత్రము అరిశెలగోత్రము.

హాస్యగాడు—అయితేమాగోత్రం గారెలగోత్రం.

గోత్రముజూచినామీరు మేము క్రిందమీదపడుతూయుండేవారమే॥ అయితే నేతివారివంశములో వారమే మేము మీదౌహిత్రులమూటచేత మీకు మాకు భావమరదుల వరస అయినట్లుగానే కనుపడుచున్నది॥

హాస్యగాడు—సరేగాని మీపేరేమయ్యా

బ్రాహ్మణుడు—నాపేరు సుబ్బంభొట్లు

హాస్యగాడు—మీరేనా ముద్దపప్పుసుబ్బంబొట్లుగారు

బ్రాహ్మడు—మీ పేరేమయ్యా

హాస్యగాడు—నాపేరుటిమ్మాప్రధానులు అయితే మీారేనాచింత చెట్లమీదనుంచి ఘూకిపడేవారు యేమీా అయితే మీరు చెప్పకుండానే మీపేరు తెలుసుకున్నానయ్యా॥

హాస్యగాడు—మాముఖముచూచితెలుసుకున్నారా యేమి అవును॥

హాస్యగాడు—సుబ్బంబొట్లుగారు మూర్ఖునివివాహమునకు శుభ ముహూర్తము కస్తుమునీంద్రులవారున్న తష్టప్రజాపతిగారున్న నిశ్చ యించియున్నారు గానిచూడగ నాకెంతమాత్రము బాగుండ లేదయ్యా॥ హాస్యగాడు—నేనుచక్కగా విచారించుతానుగాని నాదికా ప్రయత్నమా యయ్యా సుబ్బంబొట్లుగారు అంచారు నిదికనేచూచుకోవలశినదయ్యా అట్లామాట్లాడుతావుయేమయ్యా॥

సుబ్బంబొట్లుగారు—ఆలాగైతే సరేవిచారించిచూచెదను అయ్యా మీరుయేతిథి యేవారము యేలగ్నము యేతార యేర్పరచినారు చెప్పండి॥

పాస్య గాడు — చెప్పుచున్నాడు అక్షదిక్షినామసంహ్వాత్సర ఆశ్వీయుజశుద్ధ అమావాస్య కొత్తమంగళవారముగోజున శిక్షాంతపరచినాను యిది యీగ్రామంలో శిద్ధాంతులు చాలాసంతసించినారు॥

సుబ్బంభొట్లుగారంచున్నారుగదా శుద్ధఅమావాస్యయేమటయ్యా

అయితే నాపంచాంగము నేనేగుణించుకున్నాను కాకితముచాలకపోవడమువల్ల శుద్ధపక్షమందే అమాస్యవ్రాసి ఆమాసము పూర్తిచేసినాను॥

సుబ్బంభొట్లుగారు అంచున్నారుగదా—తిథులుతగ్గించడం యెచ్చించడము మీస్వాధీనమేనా॥

అయితేమావూళ్ళో నాకంటె చదువుకున్నవారులేరు నాయేర్పాటుకు యేమీఅడ్డులేదు॥

సుబ్బంభొట్లుగారు—కొత్తమంగళవారంయెమటండి॥

తిమ్మావధానులుగారు మావూళ్ళో పాతమంగలి పారిపోయినాడు॥

పనిచేసేవాడులేక క్రొత్తమంగలిని తెచ్చుకున్నాము గనుక ఆరోజుకొత్తమంగళవారము॥

సుబ్బంభొట్లుగారు లగ్నంయేమండీ కన్యా తులసందున వృశ్చికముప్రవేసించే సమయంలో అనగావృశ్చికలగ్నం సరేనీవులన్నియెరిగినవాడవేగనుక నన్నడగ నక్కరలేదు కన్యాదాతగారితో జెప్పి కావలశిన వస్తువలు కడురయంబున జాగ్రతచేయించుమూ అనియిద్దరుపోరుచున్నారు॥

అంతటను భటుండు యొకడువచ్చి హేవిశ్వకర్మవంశోద్ధారకా పరాకు మేమువేగంబునంబోయి రాగలబంధువర్గంబునెల్ల రమ్మనిజెప్పి వారివారికి తగురథగజ తురంగంబులిచ్చి వచ్చితిమి రేపుతెల్లవారువరకెల్ల వారునుదయముచేసెదరు.

మయబ్రహ్మగారు॥ ఓభృత్యా సానగాదులు దిక్పాలకులు దేవేంద్రాదిదేవతలు మొదలగువారందరను రమ్మనుమనిజెప్పివచ్చినారా భృత్యులారా

అయ్యా అందరును అతిరయమ్మునరమ్మనిజెప్పివచ్చితిమీస్వామీ॥

అంత కస్యపుండంతరంగంబున నపరిమితానందంబునొంది కార్య సాఫల్యమునకు సంతసించి మనంబున నేమని వితర్కించుచున్నాడు॥

క. దినకరుడిప్పుడుపరిణయ। మునకును రావలయుగాన ముల్లోకములం।
దును కీకట్లును బాపం। గనుతగునాదిత్యునుంచ గావలెనిపుడుర్.

వ. అనుచుభటునింజూచి హేపరిచారకా ద్వాదశాదిత్యులలో నొకండగునరుణుని కార్యంబునకు నియమించవలెను గావున త్వరితగతి నరగియరుణునిందోడితెమ్ము.

అనిపంపగా వానిచేనాహూతుండై యరుణుండు వచ్చువిధంబేమనిన.

సురటరాగం ఆటతాళము.

అరుణుండు వెడలివచ్చెర్ కస్యపుని ఆజ్ఞవలననువడిగర్ తర్కించకావేళ తడావూసేయకానూ॥ అరుణుండు వెడలివచ్చెర్॥ ౧

బాహుబలేంద్రుని పట్టణేశుని పైని మదిసలిపియు సాహసమున తాను సత్వరగతితోడ॥ అరుణుండు వెడలివచ్చెర్॥ ౨

కస్యపమునీంద్రా నన్నుబిలచిన కార్యమేమి దెల్పుడా వస్యము సేయుదు వడిగదెలుపుమనుచూ॥ అరుణుండు వెడలివచ్చెర్॥ 3

కస్యపులద్విపద. వచ్చినిలచినరుణునితో యేమనిచెప్పుచున్నాడు.

ద్విపద. చెప్పెదవినుమీవుచెవియొగ్గివినుము గొప్పగానెంచుమీ కూరిమితోడ సూర్యునకీవేళశుభకార్యమయ్యె ఆర్యులుమెచ్చగానన్నిలోకములు తేజంబుజూపుచు తీవ్రములేక నేజెప్పుమాటలనెనరుతోనెంచి సూర్యునిమారుగా సుఖలీలగాను ధైర్యముతోబోవు ధరసుస్థిరముగ పెళ్ళికార్యముమేము పెండోటియందు కళ్ళజూతుము దినకరసమతేజా.

వ. ఇట్లుమునీంద్రుండానతిచ్చిన అరుణుండేమనుచున్నాడు.

సీ. భాస్కరుడుపెళ్లికొడుకట్ల ప్రతినిధియట। పల్కగానెట్లునోరాడెభవ్యచ
రిత। నేనునికార్యమునకొల్లనింకనేది। జెప్పగాజేతునీ వేళశీఘ్రముగను.

వ. కశ్యపుడు నీకుగౌరవంబయిన పని నియమించినను దానికి య్యకొనక నీవీవిధంబునబల్కితివి గావున నీవుమర్కటాకారుండవై మహినుండు మనిశపించిన నాశాపవశమ్మున నరుణుండుమర్కటంబై శ్రీరామచరణారవిందంబులు సేవించుచుండెనంత.

వ. అంతకశ్యపుండు ద్వాదశాదిత్యులలో రెండవవాడగు తపనుని బిలచి యిట్లనియె.

కశ్యపుడు గీ. ఓయితపనయిప్పుడొకపని జెప్పెద। జేసితేనినీకుచేటులేదు।
మారుబల్కితేని మర్కటరూపంబు। అన్నరీతినీకునావహించు.

వ. అంతపనియేల తమసెలవుచొప్పున దానిందప్పక నెరవేర్చెదను అనతిందు స్వామీ తమఆజ్ఞాప్రకారం నేనడుచుకొగలవాడను.

వ. కస్యపము॥ ఆర్యవినుతుండగు సూర్యుండు కార్యావసరమ్మున నేతేరనున్నవాడు భార్యాసమేతుండై సత్వరంబుననే మరలివచ్చుగావున నీవంతవరకు నతనికిప్రతినిధిగా నుండియేలోకంబును లేక లోకంబు లేలవలయును॥ స్వామీమహాప్రసాదము ఆలాగుననే నెరవేర్చెదను అనితపనుదు అంటున్నాడు.

కస్యపమహామునీంద్రులవారు॥ ఓయితపనా నీవులోకషంచారంబెరుంగవు గాన నేజెప్పుమాటలు తప్పకమనసంగ్రహించుము॥

సీ. మాయవేషంబులమరిమారిదిరిగెడు రాక్షసవీరుల రౌద్రములకు
భయమునొందక చాలభద్రంబుగానుండిసంచార మొనరించుసద్గ్రహాధ
రాహుకేతువులనులక్ష్యంబుసేయక నదలించిపోవలె నప్పుడపుడు
గగనవీధిని దేవకన్యలతోడనుజిక్కకపోవయ్య శీఘ్రముగను
మకరవృశ్చికరాసులమట్టుపడక। మెల్లవారలునీకుచేమోడ్చిమ్రొక్క
ప్రోదిగానిమ్మజగమెల్లబోగడగాను। వెడలిపోవయ్యతపనుడవేగిరముగ॥

వ. ఇట్లానతిచ్చిన నత్తరి తపనుండు వాయువేగంబునం జని సూర్యుంజూచి యేమనుచున్నాడు.

తపనుడు సూర్యుంజూచి దేవా కస్యపునాజ్ఞచొప్పున నేనువారియొద్దకుబోయి వచ్చినాడను మయపుత్రియగు సాజ్ఞాదేవిని తమకిచ్చి వివాహంబుసేయనిశ్చయించినారు మీరుశుభకార్యంబునకుబోయి మరలివచ్చునందాక మీరాజ్యంబున మీకుప్రతినిధిగా నన్నుండుమని మునీంద్రుండాజ్ఞాపించినాడుగావుననేని రాజ్యంబుననుండెదనుసెలవిత్తురుగాకనను గుము భాస్కరా.

సూర్యుఁడేమనుచున్నాఁడు

గీ. సంతసించినాఁడసజ్ఞనుఁగొరిగిన, కార్యసఫలమెట్లు గాకయుండు
నేఁపెవోయివత్తు నేర్పుతోఁడను రాజ్య, మేలుమయ్య నీవుమెలకువగను.

వ. ఇట్లుసూర్యుఁడు తనరాజ్యంబునుతపనునకుపప్పగించి పరిణయ మహోత్సవంబునకు ప్రయాణంబై రథమునైనధిష్ఠించి వచ్చుచుండె నాసమయంబున పెండోటపట్టణం బేవిధంబుగా పురజనంబు లలంకరించుచుండెననిన.

సీ. పెండోటపట్టణమందు సౌధంబులు చిత్రిపురంగులచిత్తరువులు
వ్రాయించిప్రతిమలవరుసమేడలపైని యుంచిరినిలబడియుండునటుల
పచ్చలతోరణాల్ బాగుగాగట్టించి పందిళ్లువేసిరిపలుతెరగుల
అరటికంబంబులనాకులతోఁదెచ్చి స్తంభసంచయంబు దరిననిలిపి
రాజమార్గంబులందునురమ్యముగను చలవపందిళ్లువేసిరిసామజముల
నశ్వములవృషభములనునలంకరించి ఉపవనంబులచెంతనేయుంచిరపుడు.

వ. అట్టిసమయంబున మణిమయకిరీట పరిభాభాసమానుండగు భానుండు రథారూఢుఁడై యూరిచెంతకేతెంచిన తెరంగెరింగి కశ్యపాది మునులు సనకాదిపంచఋషులు నింద్రాదిదేవతలు రాజభటసమూహంబులును సూర్యునకెదురుగ జని ఆర్యసమ్మతంబగుమర్యాదలంజూపి భేరీమృదంగాది వాద్యవిశేషంబులతోఁడను వారాంగనాగాననటనంబులతోఁడను వెంటంగొని వచ్చునెడ రాజమార్గంబున కిరుగడలనుండు సౌధంబులపైనుండు సౌందర్యవతులగు స్త్రీలు సూర్యునిజూచు వేడుకలతోవచ్చు విధంబేమనిన.

సీ. కొప్పుబెట్టుచునొకకొమ్మలొందరతోఁడ కేశపాశమ్మునుకేలబూని,
తిలకంబుదిద్దుచు తీవమూతోనొకయబ్జాక్షి చేతనద్దంబునుంచి, రవికె
తొడిగెడువేళరవిరాకవినివేగ పడతియొక్కతెతనపైటమరచి, మడుపులుపటికిచ్చు మానినియొక్కతె సున్నమా కుకునురాచుచునువేగ,
వచ్చినిలబడిసౌధగవాక్షులందు, జూచుచునుతనివిదీరకసూర్యమోము, నందమునుగనిసాజ్ఞయదృష్టమనిరి, భానుదేభర్తయగుటయు భాగ్యమనిరి.

వ. ఇట్లువచ్చి సూర్యునిసౌందర్యంబుజూచి యింతులందరింక నేమనుచున్నారు.

సీ. మునివరుల్ చెప్పినముచ్చటల్ నిజమాయె తపసులయోచనల్ తప్పిపోనె, మనసౌజ్ఞకునుతగ్గ మగడుదొరికెగదమ్మ సంతసమాయెనేసఖియలార। యీడైనవాడమ్మ యినుడుసౌజ్ఞాదేవి సౌందర్యమునకును సరిగనుండె। ఆముఖదీప్తియు నానేత్రకాంతియు నాచక్కదనమెన్న నజునితరమె। మన్మథుడు యెందుకితడున్నమందిరమున। కన్నులారంగ జూచినకరువుదీరు। వారివైభవమేమమ్మవారిజాక్షి। పూర్వజన్మకృతంబైనపుణ్యఫలము.

వ. పురస్త్రీలందరీరీతిగా సూర్యుంజూచుచు వర్ణించుచుండ పరివారసహితంబుగా భాస్కరుడు పరిణయమంటపంబుం బ్రవేశించు విధంబెట్లనిన,

ఖమాచిరాగం- ఆదితాళం.

సూర్యుడువచ్చెచూడుడీ। ఆర్యులెల్లబాగడగ॥ సూర్యుడు॥ సూర్యుడువచ్చెను సుజనులతో శుభ కార్యంబునకునుకదలివచ్చెనిదె॥సూ॥౧

దేవబృందములుదిక్పాలకులును సేవజేయుచునుచెంతనునడువగ॥

సీటుమీరగనునిజపరివారముతోటిపట్టణపుతూర్పుద్వారమున॥౩

మకుటదీప్తులునుమరిమరిమెరయ గనికటమ్మునమౌనివరులునడువగ॥ సూర్యుడు॥ ౪

వారాంగనలును వాంఛలుమీరగ చేరినాట్యములుసేయుచుండగను॥ సూర్యుడు॥ ౫

హాయలుమీరగను యువిదలుపాడగ మయునియింటిముఖమంటపంబునకు॥ సూర్యుడు॥ ౬

సురకన్యలుభాసురముగవింజామరలువీవగనుమందగమనమున॥ ౭

వ. ఇట్లుసూర్యుండువచ్చి మణిమయమంటపంబున కలంకారంబుగా గూర్చుండియుండినసమయంబున బ్రహ్మరుద్రాదిదేవతలందరు మయుంజూచి యేమనుచున్నారు.

దరువు-జంఝూటిరాగం.

భూమిలోననీదు పుణ్య మేమనెంతు మోమయా స్వామినీదుగూతు సూర్యసతిగ జేసితేమయా॥ భూమి॥ ౧

మూడులోకములను సూర్య డీడులేనివాడుగా చూడగాను చోద్యమునీ సుందరిని వరించెగా॥ భూమి॥ ౨

కటుకచీకటులానుబాపు కాంతులుగలవాడుగా నిటలాక్షసన్నిభుడినుడు నీసుతభర్తాయెగా॥ భూమి॥ 3

కలకాలము వెలుగు ప్రభా కరుడుడినకరుడుగా ఇలనుకులము వెలిగెనయ్యా నితనికిసుతనివ్వగా॥ భూమి॥ ౪

వ. ఇట్లుకొనియాడ నప్పుడలగ్నసమయంబయ్యె నయ్యెడ పెండ్లికుమార్తెయగు సౌజ్ఞాదేవి వివాహమంటపంబునకు జనుదెంచు విధం బెట్లనిన.

మధ్యమావతిరాగం-ఆదితాళం.

వెడాలివచ్చెనుజూడరమ్మ। మయుప్రతిసౌజ్ఞ॥ వెడలి॥
వెడలివచ్చెతనవెంటనుచెలియలు మదుపులివ్వగా మదివేడుకతో॥ వెడలి॥

జలకములాడిచక్కగాను। పచ్చనివలువ చలగుచూగట్టిముందుగాను। కలకంఠిరోయా కమలాస్త్రుడనను వలగొనియెప్పుడు వలచునో యనుచును॥ వెడలి॥ ౨

కమ్మనికస్తూరిబొట్టుబెట్టి। ఘనమైనారవల సొమ్ములూ మేను నిండబెట్టి ఇమ్మహిలోపల కమ్మవిలుతుబో లమ్మలార యందమ్మన నినుడని॥ వెడలి॥

స్థిరముగా బాహుబలేందురుని పురదై వామైనాశివుని కరుణాను మదినిగోరి విరివిగవనితలు వెంటసునడువగ కరమొప్పగగజగమనంబులతో॥ వెడలివచ్చెను॥ ౪

వ. ఆసమయంబున మంగళతూర్యంబులనేకంబులుగా మ్రోయుచుండ సౌజ్ఞాదేవి మునిపత్నీసహితంబుగా వివాహవేదికం బ్రవేశించిన సమయంబున వధూవరులన్యోన్యముఖావలోకనోత్సుకులై యుండ వారి మధ్యను పట్టుపుట్టంబుతెరగాబట్టించి పురోహితుండు త్వష్ట్రప్రజాపతిని

పురస్కరించుకొని మయుండు నరునకు మధుపర్కంబులొసంగి నిజసతీ
లలామయగు శాంతంజూచి యేమనుచున్నాడు.

క. సుతసౌజ్ఞపాణిగ్రహ। పతిహస్తమునందునుంచిపరమార్థమునన్।
సతిధారవోయవలెస। గ్గతికినిసాధకము రమ్ము కాంతా వేగన్. (దై

క. బంగరుకలశమునీరిఘనము। పొంగుచు నుదకంబుతెచ్చిపోయుము యిపు
అంగనవరవిపాదంబులు। బంగరుపళ్లెరమునందుమడతికిడి గెదన్.

వ. అని చెప్పినసమయంబున తరుణీమణియగు శాంతాదేవి యేతెంచి గంగాదిపుణ్యతీర్థంబులనుండి తెప్పించి జలంబులుధారగావోసిన మయుండు ప్రభాకరుపాదంబులు బంగరుపళ్లెమునందుంచి కడిగి యాజలంబులు తమదంపతుల శిరంబులంజల్లికొని అంత వరునికరంబున వధువుకరంబు లిడి పాణిగ్రహంబుగావించి తెరపట్టంబట్టి యెత్తిన వధూవరులన్యోన్య ముఖావలోకనోత్సుకులైయ్యును లజ్జావనతవదనులై నోరకొరకోర జూపులంజూచుచుండ మయపురోహితుండగు త్వష్టప్రజాపతి మాంగల్యధారణంబుచేయించి కొత్తముత్తియంబులు తలబ్రాలుపోయించే నాసమయంబున నచ్చటిమచ్చకంటులందరేమనుచున్నారు.

కల్యాణిరాగం

కల్యాణమునుజూడుడీ కాంతలారా కల్యాణమునుజూడుడీ॥పల్లవి॥
కల్యాణమునుజూడు కమలామిత్రునకును కల్యాణగుణిసౌజ్ఞ కాంతయయ్యెనమ్మ॥ కల్యాణమునుజూడుడీ॥ ౧
కశ్యపాదిమౌని ఘనులాశీర్వదింప వశ్యముగా దేవవరులమునుగొల్వగ॥ కల్యాణమునుజూడుడీ॥ ౨
బ్రహ్మాదులును దీవింప గనుముదమున మయబ్రహ్మసుతసౌజ్ఞను చేపట్టినమ్మయినుడు॥ కల్యాణమునుజూడుడీ॥ కాంతలారా॥ ౩
బ్రహ్మముడి త్వష్టప్రబ్రహ్మవేయగనపుడు బంధువులందమొందె బంధువర్గమంత॥ కల్యాణమునుజూడుడీ కాంతలార క॥ ౪
బావాలు బలేంద్రుని పట్టకేశులుండిప్పుడుత్సాహముతోడ నీసతీపతులనుబ్రోచు॥ కల్యాణమునుజూడుడీ కాంతలారా కల్యాణమునుజూడుడీ॥

వ. ఇట్టిసమయంబున సభాసదులంజూచి మయపురోహితుండగు త్వష్టప్రజాపతి యెదురనిలచి యేమనుచున్నాడు.

... త్వష్ట్రప్రజాపతి॥ ద్విపద॥ వినుడుసఖికులార విశదంబుగాను ఘనుడుమం బ్రహ్మ గదభువిలోన ఆదిత్యవర్గమందధికుడైనట్టి యీదిన కరునకు నీస యమునందు సాలంకృతంబుగా సతితోడగూడి బాలికామ ణినివ్వ భాగ్యంబుగాదే యింతటిపుణ్యఫలమెవరికిగలుగు సంతసించిరిదే వ సమితిమర్త్యులును మయుడు బ్రహ్మనందనమయుడాయె దీన హాయుమే ధశతఫల మతనికిగలిగె లోకబాంధవుసతి లోలాక్షి సౌజ్ఞ ప్రాకటము గసుతుల్ వశిసివర్ధిల్లు ఇనునికల్యాణంబు యింపుతోజూడ మనపుణ్య మేమయ్య మానీంద్రులార ఇట్టిపరిణయకథ నింపుగావిన్న మానుజుల కర్కంటు మరియాదరమున ఆయురారోగ్యంబు లమితంబుగాను యీ యగలడయ్య భాగ్యమీభువిలోన సిరిసంపదలొసంగి శీఘ్రంబుగాను సర గునబ్రోచును సజ్జనులారా.

వ. అనియీవిధంబున త్వష్ట్రప్రజాపతిబలికి వధూవరులచే దేవబంధువర్గంబుకెల్ల వేరువేరనమస్కారంబులు జేయించే ననంతరంబున మయుండు బ్రహ్మాదిదేవవర్గంబులకనేకవిధసత్కారంబు లొసంగి బంధుమిత్రవర్గంబులకు బహువిధ పదార్థంబుల విందుచేసి మయుండ మందానంద మయుండై జామాతయగు మార్తాండు నుద్దేశించియేమనుచున్నాడు.

మయబ్రహ్మ॥ హేమిత్రా దానపాత్రా నాపుత్రి సౌజ్ఞను నీకొసంగితి ఇంక దివ్యాంబరాభరణంబులును రథగజతురంగంబుల నొసంగెద గాన గయికొనుమయ్యా భాస్కరా॥

భానుడు అంటున్నాడు॥ చిత్తము తమయాజ్ఞచొప్పున తప్పక పుచ్చుకుందును గాన నవియొసంగుడు మామగారు॥

మయుడు సూర్యునితో నీకుపూర్వము నాచే హరితాశ్వరథంబివ్వబడినది యీసమయంబున నంతకన్న మిన్నయగురథంబొసంగబడు గాన దానిమహిమ జెప్పెదవినుము భాస్కరా॥

ద్విపద॥ వినవయ్య భాస్కర విన్నవించెదను ఘనమైనరథమిది కడురమ్యమయ్య॥ మంత్రబలంబున మరివేగనడుచు యంత్రముల్ గలవిందు నమితంబుగాను కోరినయర్థంబు కూరిమినిచ్చు నీరథంబులదోల్లు నిత్యంబుగాను పారమార్థికమిచ్చు బహుళంబుగాను॥

మయబ్రహ్మ॥ వ. మరియు తనతనయయగు సౌజ్ఞాదేవిని తపను నకుసమర్పించెను తరి మయుండేమనుచున్నాడు॥

సీ. అబ్జినీతాపమ్ము కాగజాలగలేదు తీక్ష్ణముకొంతతగ్గించుమయ్య
ఇక్లేశుడును బాలుడింతవరకీ బాల సంచారమునుజేయుసమయమందు
క్రూరుకారాక్షసకోటిచెలగాంచి నభయపడుగాననభయమొసంగు
రథముమేరుపృశిఖరమునఘాటిగదోల బెగ్గిలునయ్యనీభీరువింక
కష్టములనెల్లగనుచుయ్యుకరుణతోడ। సిగ్గుచేనభిమును జెప్పకుండు।
మనసునిష్టముగనిపెట్టి మాన్యచరిత। నీవుబాగ్యుడవన్నిటనీరజాప్త॥

మయబ్రహ్మ జెప్పుచున్నాడు. పంచచామరము॥ ఒకానొకప్పుడైనదీని యొంటినుంచబోకు సంధ్యకాలమందురాక్షసులును ధార్ష్ట్యములనుజూపెదుర్ అకారణంబుగానుదీని యాజ్ఞసేయబోకునీ సకాశమందు జెప్పియుంటి సద్గుణాబ్ధిచంద్రమా॥ ౧

సూర్యుడు యేమంటున్నాడు॥ పంచచామరము॥ పరమప్రీతిపెళ్లియాడి భార్యనెన్నడొంటిగా ధరణివిడువగలడుజూడ ధన్యచరిత జెప్పుమా॥ కరుణవీడికాంతనెవడు కారణంబులేకను తిరముగదండించునింత తెలియజెప్పనేలను॥ ౨

మయబ్రహ్మ పం. దూరకిమనకనిచ్చినానుద్యుమణిసీకునాసుతన్
కోరినపుడుబంపుమయ్యకోమలిమాయింటికిన్.

సూర్యుడు పంచ. సారసాప్తుడనగవినవెనచ్చరిత్రతనన్నునీ
చారుగాత్రియైనసౌజ్ఞసౌఖ్యమెరుగకుందునే.

అంత కశ్యపమహాముని హేమయబ్రహ్మ సూర్యునకుసుతనిచ్చుటచేమాయత్నంబుసఫలంబయ్యె దీనమాకపరిమితానందంబయ్యె మాకు సెలవొసంగుడు పోయివచ్చెదము.

మయబ్రహ్మ—తమకరుణాకటాక్షమ్మున సఫలమనోరథుండనైతి

అంత కశ్యపుడు—మరియును మీపుత్రికను మిత్రునకిచ్చుటచే మీపితృదేవతలు నిరంతరస్వర్గప్రాప్తులైరి మీపుణ్యం బేమనిజెప్పవచ్చునయా మయబ్రహ్మగారూ.

మయబ్రహ్మ—యిదియంతయు తమయనుగ్రహమే కాదా.

కశ్యపమహాముని—బ్రహ్మకూర్చుటచే నైనదేగాని యవరివల్ల నైనదియుకాదుస్వామీ.

మునులు వ॥అనుచుసెలవుపుచ్చుకొనినిజనివాసంబులకరిగిరంతట.

సౌజ్ఞాదేవితల్లియగుశాంతాదేవిమానికాంతసమేతయై జామాత యగు భాస్కరునకు కూతునువప్పగించువిధం బెట్లనిన.

వ. హేమిత్ర నీవుదానపాత్రుండవనియెంచి మాపుత్రికనొసంగితిమి గాన దీనియందు అన్యోన్యానురాగుండవై యుండవలయును లోపము లేవయిన యుండినను కోపించక క్షమియింపుము అనిజెప్పి మరియును.

వప్పగించెడుపాట-మధ్యమావతిరాగం.

పన్నెండేండ్లాపెంచిపట్టినిచ్చితినీ। మన్నించిబ్రోవుమీమాన్యచరిత్ర। గొప్పవాడావనుచుకోరియిచ్చితిమీ। తప్పకదయతో మాతనయా నేలూమూ। కోపగించితివేనికొన్నినిముషములు। నాపట్టిమోముచిన్నాబోవునయ్యా। దానిమనసూనెరిగితరచుగానీవు। మానుముకోపింపమా తండ్రివినుమూ। పొరుగింటికెప్పుడును పోయియెరుగాదు। పరులతో నెప్పుడునుభాషించదయ్యా। వంటిగాబోనేరదింటిలోపలకు। జంట బాయకయుండుజలజవల్లాభ। తల్లిచాటునపెరిగెతపనయీతన్వి। కల్లగాదయ్యాయీకన్నియనేలూ। సాగ్రముగాదెల్పుసకలకార్యములు। ఆగ్రహించకబోకుమన్నియడలాను। ఆకలెరిగియుయన్నమడుగనేరాదు।యీకల్కియభిమాని యిదియెరుగూమయ్యా। చద్దిభుజియించునుచానమాయింట। వద్దనులజ్జచే వనితామీయింట। ముద్దుగాపెరిగెను ముదితమాయింట। సిగ్గుచేనభిమతముచెప్పకుండూను। యొగ్గుసేయకదీనినేలుకోవయ్యా మాపట్టినిచ్చితిమి మర్యాదగాను। చేపట్టిబ్రోవుమీశీతాంశుముఖినీ। లోపముజేసినను లోలాక్షినెపుడు। కోపించకనుదిద్దుకోవలయునయ్యా। బాహుబలేంద్రునిపట్టణేశుండు। ఐహికాముష్మికములననయమునిచ్చు। ధరసూరికృష్ణయనుదయలేలుగంగా। ధరుడుమీదంపతుల దయతోడబ్రోచు॥ గౌరీకల్యాణం॥

వ. అంత సూర్యుండేమనుచున్నాడు.

క. సుతనొ సగిలిరీయెడనా। కతిసంతసమా యెనమ్మయజ్ఞుడ సేయూ
సతిసౌఖ్యమెరుగకుందునే। మతిసందియమేలనమ్మామానినిసేకుః.

వ. అనుచు నల్లుంతుపలికినపలుకుల కానందంబునొంది కూతు చెంతనిలచి యేమనుచున్నది.

శాంతాదేవి వ. అంమ్మా సౌజ్ఞా నీకతిసౌందర్యవంతుండు భాగ్యవంతుడునునగు భర్తదొరకెను నీకింకేకొదువ చిన్ననాటనుంచి పెంచిన మోహమ్మున మేము విడుతజాలకున్నాముగాని నీకుసర్వముగలవు గాన నీవునీపతితోడ నతికుతుకమ్మునం బొమ్ము మమ్ముం జూడగోర్కె గలిగినప్పుడు నీమనోరథం బెరిగించినచో రథమ్మునిచ్చి నిన్నుంబంపునప్డు రమ్ము నీముఖమ్ముచిన్నబుచ్చుకొనకుము సంతసంబునంబొమ్ముకుమారీ.

సౌజ్ఞాదేవి గీ. అమ్మపతితోడనన్నుబొమ్మనియెదమ్మ। మిమ్మునెడబాసి
పోజాలమిత్ర్తతోడ। అంతరంగంబునవిచారమయ్యెనమ్మ।
పుట్టినట్టిల్లువిడచెట్లుబోదుతల్లీ.

వ. అనుచు సొక్కుచున్నసమయంబున తల్లియేమనుచున్నది.

శాంతాదేవి వ. కుమారీ యింతవిచారమేల నీయీడుపడుచులం జూడవా అత్తవారింటపెత్తనంబులుసేయుచు పతులతోడంగలసిపలువిధంబులగు సుఖంబు లనుభవించుచున్నారు లోపలివిచారమంతయు వెలుపలించవచ్చునా నీకెందుకింతచింత తల్లీ నిన్నుజూడక కొన్నినిముషములైన నేనుండగలనా ఊరకవిచారమెందుకూరుకోవే యని తల్లికన్నీరు గార్చుతరి పిల్లయు వెక్కివెక్కిసొక్కుచుండె నాసమయంబున తండ్రి మయబ్రహ్మ శాంతాదేవితో యేమియీయజ్ఞానము నీవుకూడా దానికి తోడైనావునాకులేదావిచారము అరగడియకనుపించకుండినచో అమ్మా యని పిలచిచూచి ముచ్చటించకుండిన నామనసునిల్వకుండును ఆడుపిల్ల పుట్టినతర్వాత నన్యులసొమ్మేగాని మనస్వాధీనమేమియున్నది ఇంతవర కెంతో ప్రీతితోపెంచి ముద్దులు మురిపెములు జూచినాముగనుక కన్న మోహముచే కన్నెనువిడజాలకపోవుటేగాని ప్రయోజనమ్ములేదు ఆల స్యంతేల మనముద్దుపట్టికి బుద్ధులుచెప్పి పతితోబంపుము విచారము విడువుము.

వ. అని మఱియు బ్రహ్మ యనతిచ్చినసమయంబున శాంతాదేవి య
న తనయకేవిధంబుగా బుద్ధులు జెప్పుచున్నదనిన.

శాంతాదేవి ద్విపద—పాలతిరో యెన్నాళ్లు పుట్టింటనున్న కలికి
య త్తిల్లు కావలయునుమ్మా అమ్మరో యత్తింటికింపెదము గాని సమ్మ
తితో పామ్మా సందేహించకను పతియొగతియనినమ్మా భావంబులోన అతి
గవి గించకమ్మా యీవేళ పతిమతిగలిగిన భావంబు దెలసి సతిరో యెల్లప్పు
డు సంచరించుమమ్మా మోముజూచి యెభావమును గనవలెను కోమలివాద
ముకూడదు పతితో సంతోషముగనున్న సమయమందున యింతిరో సర
సము యించుకావమ్మా అలసివచ్చిన వేళలందు పతి నెప్పుడు అలివేణియె
క్కువలడుగబోకమ్మా కలసేటివేళలో కలికి నీపతిని వంచించవలదమ్మా వలదు.
సిగ్గెప్పుడు కష్టము నుకని పెట్టి కాంత నీపతికి యిష్టమౌవస్తువులనింపుతోని
మ్మా గొంతెత్తి మాట్లాడకూడదు కుమారి పంతములాడకు పతితోడ నెప్పు
డు తప్పుజేసితివేని తప్పక నీవు ఒప్పుకోవలెబొంకువలదెప్పటికీని కోప
గించినవేళ కొమ్మరో నీవు యెప్పుమీరంగను యెదురించబోకు పొరుగిళ్లకు
ను నీవు పాలతి యెల్లప్పుడు చారవగాబోతేను చుల్క సేయుదురు పిలువని
యింటికి పేరంటమునకు లేనర్లోపోపమర్యాదగాదమ్మా తెల్లవారకమును
పు తెలివిగా లేచి యెల్లపనులను సేయుమింతిరో వేగ ముందుభుజియించ
కుమీ ముదితరో నీవు అందముగానుండుమమ్మా యెల్లప్పుడు లోలాక్షి నిన్ను
ఆలోచనడిగితె చాలగా యోచించి సరగున జెప్పు అత్తమామల యెడల
నతిభక్తియుంచు కొత్తగా నెంచకు కోమలి వారి భావగారి యెదుట భా
షించకమ్మా దోవబోయ్యే వారితోంగి చూడాకు ముద్దు దయజూడును మ
ర్యాదగాను గరితా డబిడ్డలకరుణ జూడుమా.

వ. శాంతాదేవి యీవిధంబున కూతునకు మతులు జెప్పి పతి
తోడ రధముపై నెక్కించి అరణంబుగా నరదంబులును గజతురంగంబుల
నొసంగి కొంతవరకు కూతునల్లురంజూచుచుండ రధంబు సారధి రయం
బున వాయుపదంబున దోలినదృష్టిపథంబు నతిక్రమింప జననీజనకులు
నిజనివాసంబునకుంజని కుమారిగుణంబుల నెంచుకొనుచు సుఖంబునుం
రంత—అనంతరంబున సౌజ్ఞాదేవి భర్తసాన్నిధ్యమున.

గీ. భాస్కరునిగూడిసౌజ్ఞయుపలుసుఖంబు। లనుభవించుచునతిసంత సమునసుండి। సుతనిధర్మ్మనియమునసుసుతనుగనియె। వారువర్ధిష్ణులంయికీర్తివడయుచుండె.

సురటరాగం_మంగళహారతి.

మంగళంమంగళం మార్తాండప్రభునకు మంగళందేవతామా న్యునకుమా మంగళంముల్లోక మండిప్రతాపునకు మంగళంఅంబరమం దిరునకూ॥ జయమంగళం. ౧

యేకచక్రరథమెక్కి మోదంబున లోకముజూచుచునీలోలాక్షి నా లోకించితనమదిలోనభ్రమనుజెంది ఆకల్కిసౌజ్ఞనుపెండ్లాడినయిను నాకు॥ మంగళం మంగళం॥ ౨

సూర్యనొక్కవేళ జూచిసుందరాంగి ధైర్యముచెడియాడు తరు ణులతో కార్యముదెల్పక కడులజ్జతోనుండి ఆర్యానుమతినిపెండ్లాడీన సూర్యుకు॥మంగళం. 3

ధరనుబాహుబలేందుపురమునందు స్థిరవాసుడౌవిశ్వేశ్వరు ననయము పరిపరివిధములభక్తితోడనుమ్రొక్కి పరిణయమాడినసౌజ్ఞా భాస్కరులకు॥ జాయామంగళం మంగళం. ౪

---

సౌజ్ఞాపరిణయనాటకముసంపూర్ణము.

క. కృతిపతిగావిశ్వేశ్వరు మతినుంచియుచెప్పినంతమాత్రంబుననే క్షితిలోనవెలయునాగ్రహ। పతిగూర్చినదాటనధికభవ్యముగాదే.



